# ఆమె చెణుకులు

(వేయి సోయగములు
ఆమె పంచకము
ఐదవ పుస్తకము)





బెజవాడ గోపాలరెడ్డి

ఉన్నమాట:- శ్రీమతి మాలతీచందూర్
మద్రాసు,

విహంగవీక్షణం:- శ్రీమతి సి. వేదవతి
హైదరాబాద్

ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్ రోడ్డు, హైదరాబాదు - 1.

AAME CHENUKULU
(Her Flourishes & Witticisms)
BY B. GOPALA REDDI
(Stray Thoughts-Telugu)

ప్రథమ ముద్రణ
సెప్టెంబరు 1982



వెల : ఆరు రూపాయలు



ప్రతులకు
ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్ రోడ్డు, హైదరాబాదు-500 001

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజయవాడ

నవోదయ పబ్లిషర్సు
ఏలూరురోడ్డు, విజయవాడ

ముఖచిత్రం
శ్రీ మారేమండ శ్రీనివాసరావు
ఆంధ్రప్రదేశ్ లలిత కళా & సాహిత్య అకాడమీల సభ్యులు

ముద్రణ
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్,
హైదర్ గూడ, హైదరాబాదు-1.

ACC NO 12807

# అంకితము

కాంగ్రెసు ఉద్యమములలో పాల్గొని
జైళ్ళకు ఏగిన సత్యాగ్రహులు
నాపై నిరంతరము అభిమానము చూపిన

స్వర్గీయ బెజవాడ సుబ్బరామిరెడ్డి
మాజీ యం.యల్.సి.
బుచ్చిరెడ్డిపాలెం.

స్వర్గీయ పంగల్లు కోదండరామిరెడ్డి
మాజీ జిల్లా బోర్డు ప్రెసిడెంటు,
మాజీ యం.యల్.ఏ.
తోటపల్లి, గూడూరు.

స్వర్గీయ వేమారెడ్డి శ్రీనివాసులరెడ్డి
పరమ భాగవత భక్తులు
మాజీ జిల్లా బోర్డు వైస్‌ప్రెసిడెంటు, పరగలి
గారల స్నేహస్మృతికి

# గ్రంథకర్త జీవన వివరాలు

| | |
|---|---|
| జననము— | 5 ఆగస్టు, 1907<br>బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరుజిల్లా.<br>తండ్రి – పట్టాభిరామరెడ్డి<br>తల్లి – సీతమ్మ |
| చదువు— | బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు.<br>ఆంధ్ర జాతీయ కళాశాల<br>(1921–24)<br>విశ్వభారతి<br>(1924–27) |
| సమరపర్వము— | సర్కారుబడి వదులుట జనవరి 1921.<br>జైలుశిక్షలు – ఆరు మారులు.<br>1930, 31, 32, 33 లోను,<br>1940, 41, 42, 43 లోను,<br>కొంతభాగాల్లో జైలులో ఉండినారు. దాదాపు<br>4 సం॥లు జైలులో మకాం. ఎ బి సి క్లాసుల<br>ఖైదీగా డెటిన్యూగా. |
| ఉద్యోగపర్వము— | మంత్రిగా–మద్రాసు, కర్నూలు,<br>హైదరాబాదు, ఢిల్లీలలో–186 మాసాలు.<br>గవర్నరుగా–ఉత్తరప్రదేశ్‌లో 62 మాసాలు.<br>ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రోఛాన్సలర్–<br>జూన్ 1951 నుండి 57 వరకు. |
| సాహిత్యపర్వము— | తెలుగుభాషాసమితి అధ్యక్షులు–1948 నుండి<br>ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ–ఆగస్టు<br>1957 నుండి.<br>కేంద్ర సాహిత్య అకాడమీ రెండవతూరి–<br>1973 జనవరి నుండి.<br>జ్ఞానపీఠము–1963 నుండి 1971 వరకు. |

# బెజవాడ గోపాలరెడ్డి

## పుస్తకాలు

వేయి సోయగములు.

'ఆమె' పంచకము

1. ఆమె
2. ఆమె జాడలు.
3. ఆమె నీడలు.
4. ఆమె తళుకులు.
5. ఆమె చెణుకులు.

శతకవితలు.

'కవితా' పంచకము

1. కాలవాహిని.
2. సాహిత్య సుందరి.
3. ప్రసూనమంజరి.
4. పరిమళ తరంగాలు.
5. సాగర సమీరాలు.

(రానున్నది)

అనువాదములు (బెంగాలీనుండి)

1. రవీంద్రుని నాటికలు. (5 పుస్తకాల సంపుటి)
2. కథలు—కల్పనలు.
3. వానచినుకులు.
4. ఊర్వశి—కాళిదాసు.
5. నైవేద్యము—స్మరణ.
6. తాజ్‌మహల్.
7. ఇక్‌బాల్ కవితలు—ఉర్దూనుండి.

# ఉన్నమాట

ఒక గ్రంథానికి ముందు మాట వ్రాయటం గౌరవప్రదం, గర్వించదగ్గదీ, యిబ్బందికరం కూడా.

'ఔద్ధత్యము కాకపోయినా
నా ఔన్నత్యము
అందరి దృష్టుల ఆకర్షించుచున్నది
పొడగరిని, గడుసరినికాను.'

అన్నారు శ్రీ గోపాలరెడ్డి గారు 'ఆమె చెణుకులు'లో ఒకచోట. నిజమే వారు గడుసరి కారు. రాజకీయ నాయకులయి గడుసరి కాలేకపోవటం అన్నది ఉదాత్తమైన విషయం. వయసులో, అనుభవంలో, హృదయవైశాల్యంలో - నిర్వహించిన పదవులలో, సాహిత్య సౌశీల్యంలో - ఆఖరికి పొడవులో కూడా చాలామంది కంటే ఆయన ఉన్నతులు. అటువంటివారు తమ గ్రంథానికి నన్ను పరిచయం రాయమనటం ఎలా వుందీ అంటే 'మిణుగురు పురుగుని నీవో నక్షత్రానివీ'ని సంబరపడి పొమ్మన్నట్లుంది. విని ఆనందించటం వరకే తెలుసు గాని, కవిత్వంలోని లోతుపాతులూ, సౌందర్య నిక్షిప్తాలూ నాకేం తెలుసు?

అయితే శ్రీ గోపాలరెడ్డి గారు 'అభిమానంలో కాన్పించని అధికారముంది-' అంటారు ఈ గ్రంథంలో ఒకచోట. అటువంటి అభిమానంతో 'ఆమె చెణుకులు'కి మీరు పరిచయం రాయండి అన్నారు. వ్యక్తిగతంగా పరిచయం వుండి, ఆ వ్యక్తి మీద గౌరవాభిమానాలు వున్నపుడు ఎంత కాదనుకున్నా ఆ అభిమానం మాట లలో తొంగిచూడక మానదు. విమర్శకులూ, పీఠికా రచయితలూ గ్రంథకర్తకి అపరిచితులై వుండాలని ఒక వాదం వుంది ఇది కొంతవరకూ సమంజసమే కాని ఆచరణలో సాధ్యంకాదు.

విమర్శకుడే కాదు, సామాన్య పాఠకుడు కూడా ఒక రచన చదివాక ఆ రచయిత గురించి కొంత తెలుసుకోవాలని కుతూహల పడుతాడు. దేని

కంటాయి? అతనిలో రేపిన భావసంచలన కారణంగా! ఆ భావసంచలనంలో కవి వ్యక్తిత్వం దర్పణన్యాయంలా కనబడుతుంది.

రచయిత అనుభవాన్నీ, జీవిత సరళినీ, సామాజిక స్థానాన్నిబట్టి రచనకు గల సాహిత్య స్థాయిని గుర్తించటం సర్వత్రా వుంది. ఇది గణనీయం కాదని పైకి ఎంత అన్నా- 'చర్చిల్ వార్ మెమాయర్స్' చదివినపుడు కలిగే ఆసక్తి కుతూహలం మామూలు సైనికుని యుద్ధ అనుభవాలు చదువుతున్నప్పుడు కలుగదు. ఎందుకంటే, ఒక రాజకీయ దురంధరుని అనుభవాలు, అతని రాజకీయపు ఎత్తులు ఎంత చిక్కగా, ఉన్నతంగా వుంటాయో అన్న భావాలు ముందే మన మనసుపై హత్తుకుని వుంటాయి. అతని మహదనుభవాలు మనోరంజకముగా వుంటాయి.

శ్రీ గోపాలరెడ్డిగారి జీవితం వడ్డించిన విస్తరి. అ వడ్డించిన విస్తరి కూడా పంచభక్ష్య పరమాన్నాల విందు భోజనం. యాభై ఏండ్ల రాజకీయాల అపార అనుభవం- వివిధ ప్రవృత్తుల వ్యక్తులతో పరిచయం, అటు గంగోత్రి శిలల నుంచి ఇటు కన్యాకుమారి యిసుక రేణువుల దాకా భారతదేశంలోని అన్ని ప్రాంతాలని అన్వేషణా చింతనతో పర్యటించిన సాహిత్య పిపాసి. ఇంతటి అసామాన్య అనుభవసారాన్ని పదవుల పోరాటంలోని రాజకీయపు జిత్తుల్లో నేల పాలు చెయ్యకుండా, శబ్దతరంగలాస్యాన్ని భావ సౌకుమార్య సమన్వయంతో కవితలల్లడం మొదలు పెట్టారు.

'నేను భీష్ముణ్ణి నా తరంవారు ఒకరొక్కరే వెళ్లిపోతున్నారు-' అంటూ ఆజానుబాహువు ఆయనవీరు రెండు చేతులూ తిప్పుతూ అంటారు. కాని, కవితారంగంలో ఆయన్ని అభిమన్యుడందామా? వొద్దు ఆయన అభిమన్యుడైనా బాలచంద్రుడూ కాదు. ఒక విధంగా విదురుడు.

విశ్వకవి ప్రభావంతో గోపాలరెడ్డిగారిలో మొదటినుంచీ కవితా పిపాస మొగ్గతొడుగుతూ వచ్చినా, రాజకీయ సన్యాసం చేశాకగాని ఆయన కవిగా కలం పట్టలేదు. స్వీయ రచనలలో ఈయన వయసు అయిదేళ్లు మాత్రమే.

ఇన్నేళ్ల గడిచాక గోపాలరెడ్డిగారు కవిత్వం ఎందుకు చెపుతున్నారు? కవిగా సాహిత్యలోకంలోకి ఎందుకు దూసుకు వస్తున్నారు?— అని కొందరి ప్రశ్నలు.

శ్రీ గోపాలరెడ్డిగారికి ఈ ఆగస్టుకి డెభ్భై అయిదు నిండుతాయి. డెబ్భయ్యో యేట కవిత్వం చెప్పిన వారూ, కొత్త ప్రయోగాలు చేసిన వారూ లేక పోలేదు. థామస్ జఫర్సన్ రాజకీయాల నుంచి విరమించుకున్నాక, వాస్తు శిల్ప అధ్యయనం మొదలు పెట్టాడు. ఫౌస్ట్ గ్రంథకర్త 'గోతే' కూడా డెభ్భయ్యేళ్ళు దాటాక 'పర్షియన్' భాషను అధ్యయనం చేయడం ఆరంభించాడని చెపుతారు. రాజకీయ నాయకుల్లో బ్రిటిష్ ప్రధాని చర్చిల్, అమెరికన్ అధ్యక్షుడు అయిజన్ హోవర్, రాజకీయాల నుంచి విరమించాక చిత్రలేఖనంతో కాలం గడిపేవారని వినికిడి.

ప్రస్తుత రాజకీయ వాతావరణంలో, లేవలేని పరిస్థితి వస్తే తప్ప - ఆఖరి రోజు దాకా కుర్చీ కోసం సింహగర్జనలు చెయ్యటం, దాని కోసం పాట్లు పడటం సహజమై పోయింది. అటువంటి కాలంలో గోపాలరెడ్డిగారు రాజకీయ రంగాన్నుంచి తప్పుకున్నారు. ఆయన నిస్సంగులుగా వుంటున్నారని కాదు. చైతన్యంగల ఆ రాజకీయ జీవితం నుంచి, పదవీలాలస నుంచీ దూరంగా వుండటానికి ఎంతో మనోబలమూ, ఆత్మవిశ్వాసమూ కావాలి. ఈ రెండూ గల శ్రీ గోపాలరెడ్డిగారు తమ జీవితాన్ని శుష్క-వానప్రస్థంలో తుప్పుపట్ట నివ్వలేదు. స్తబ్ధ కానివ్వలేదు. నిత్య చైతన్య భరితమగు ప్రజా సందడి నుంచి సాహితీసీమవైపు దృష్టి మర్లించారు. అయితే ఆయనకి మొదటినుంచీ సాహిత్యమూ-రాజకీయాలూ ఈ రెంటితోనూ సంబంధం వుంది. ఈ రెంటినీ తమ జీవితంలో సమన్వయ పరచుకుంటూనే వచ్చి, రాజకీయ వానప్రస్థంలోంచి సాహిత్య బాల్యంలోకి దూకారు. ఒక రంగంలోంచి మరో రంగంలోకి యిలా 'హైజంప్' చెయ్యటం అరుదుగా సంభవిస్తుంది.

గోపాలరెడ్డిగారు, పంచ కన్యలు లాగా 'ఆమె'ని అయిదు సంపుటాలు చేశారు. ఈ అయిదు సంపుటాల్లో మొత్తం వెయ్యికి పైగా ముక్తకాలు ఉన్నాయి. వరకట్నాలు పోయి అమ్మాయిలకి వెయ్యి గీతికలు కానుకగా యిచ్చి వివాహం

చేసుకునే భవిష్యత్‌కి నాందిగా యీ పని చేశారేమో! లేక సహస్రనామార్చన మన సంప్రదాయంలో వుండనే వుంది. 'ఆమె' అనే యీ కవితా కన్యని సహస్ర విధాల నుతిస్తున్నారేమో! ఇలాంటి తలంపులు రాకమానవు - అయిదు సంపుటాలను ఒకచోట చేర్చి చదివినపుడు!

''ఆనంద వీచికలతో ఆరంభమయి విజ్ఞాన దీపికలని వెదజల్లుతూ ముగిసేదే - మంచి కవిత్వం,'' అంటాడు ప్రపంచ ప్రఖ్యాత కవి రాబర్ట్ ఫ్రాస్ట్.

'ఆమె చెణుకులు'లో మొదటి పద్యం అందంగా, కొంటెగా ఆరంభమవుతుంది.

'నీవు కవయిత్రివి, గాయకురాలివి. కళాపోషణ కావిస్తూ, జీవితాన్ని గడుపుకో, పెళ్ళి మానుకో' అన్నాడు తండ్రి. 'అట్లాగే నాన్నా - నీవు చేసిన హితోపదేశము నేనూ నా బిడ్డలకు చేస్తానులే' అన్నది ఆమె.

ఆమె విసిరిన చెణుకులో కవి ఒక అందమైన అనుభూతిని వివేకాన్ని వెదజల్లుతారు. ఈ భావ కుసుమాలని 'రాండమ్ థాట్స్' అని కూడ పిలవవచ్చు

'వంద మంది సామాగ్రి తయ్యారు చెయ్యాలె
ఒక సైనికుడు యుద్ధరంగానికి నడవడానికి
వెయ్యి పువ్వులు పుయ్యాలి
ఒక ఆమని రావడానికి.'

''వస్తుతః కవి ఒక స్వర్ణకారుడు. స్వర్ణకారుని చేతిలో బంగారం ఎన్ని రకాల అతి సున్నితమై ఆభరణాలు కాగలదో, అలాగే కవి తన శబ్ద స్రవంతిలో అన్ని అందాలూ మెరుగులూ సృష్టించగలడు'' అంటాడు శాంతాయన—

'కలలు కనుట - పిల్లలు కనుట
కన్నులు లేనివారూ చేయగల కార్యమే'

మాటలని ఎంతో పొందికగా వాడారో గోపాలరెడ్డిగారు!

ధ్వని, భాష, కల–ఈ మూడింటి సమన్వయంతో కవనానికి రూపాన్ని, రంగుని, రుచిని ఆపాదించగలడు కవి.

'దాంపత్యపు పందెంలో
పరాజయాలు తియ్యగానే ఉంటాయి
జీవితములో చేదుగా వుంటాయి'

అంటారు ఒకచోట దాంపత్యం అనేది ఒక అనుభూతి. ఈ అనుభూతికి మాధుర్యం ఆపాదిస్తూ, ఆ మాధుర్యంలో యిమిడివున్న చేదుని సన్నసన్నగా చెప్పారు. పరాజయం అన్నది ఆయా పరిస్థితులనిబట్టి తీపిగానూ, చేదుగానూ కూడా వుంటుంది

''జలకన్య తన పతిని చూసింది. సిగ్గుతో కందిపోయి కెంపువర్ణం దాల్చింది'' – మామూలు నీరు ద్రాక్షరసంగా మారటంలోని శృంగార భావాన్ని ఒక ఆంగ్లకవి యింత అందంగా చెప్పాడు.

గోపాలరెడ్డిగారు ఇటువంటి శృంగార భావాన్నే ఎంతో రమ్యంగా తమ ముక్తములో-

'మేఘముల నర్తకీబృందము
నృత్యము సలుపుచుండ
పర్వతములు కూర్చుని కొన్ని,
పరుండి కొన్ని, మోచేతులమీద
వాలి కొన్ని పరికించుచున్నాయి.'

సృష్టి చైతన్యాన్ని, మానవ స్వభావ దీప్తిని, జీవిత పయనంలో గమనించిన వెనుక, ఆ అనుభవసారం జ్ఞాపకాల పొరల్లో విశ్రమించి ఎప్పుడో ఒకనాడు కవిత్వ రూపంలో వెలువడుతుంది అంటారు. ఈ మాటలు గోపాలరెడ్డిగారికి పరిపూర్ణంగా వర్తిస్తాయి.

'వాన ఆగింది
వరండా పెంకుల నుండి
నీటిబొట్లు రాలుచునే ఉన్నవి.
పొగడ పువ్వులు ఒకదానిపై ఒకటి
రాలి దండ యగుటకు
సిద్ధపడుచున్నాయి'

రాలిన పొగడ పువ్వులకి ముచ్చిగలుండవు. వర్షపుబొట్ల హారాన్ని పొగడ దండగా పోల్చటం-సామాన్యంగా ఎవరూ చెయ్యని పని. వర్షపు చినుకులు బొట్లు బొట్లుగా ఒకదానిమీద ఒకటి పేర్చినట్లు రాలుతాయనడం ఎంత చక్కటి ఉపమానం.

'పువ్వులకు స్థిమితం లేదు
గబగబ రావడం, జరజర రాలిపోవడం
ఏమి మునిగిపోయిందని ఆ తొందరలు'

రాలి వాడిపోయిన పువ్వులని చూసినపుడల్లా యీ వాక్యాలు వెన్నాడక మానవు. ఒక భావం పదేపదే జ్ఞాపకం రావడంకంటే కవిత్వానికి మరో గీటు రాయి ఏం కావాలి?

గోపాలరెడ్డిగారు ఆమె గురించి ముక్తకాలు అన్నారుగాని యిందులో ఒక 'ఆమె' కాదు - 'అతను'లూ వున్నారు. రాజకీయాలు, భాషలు, చెణుకులు - అన్నిటినీ స్పృశించారు.

'రవీంద్రుడు హిందీ నేర్వ ఆరంభించి
మీసాలు, దాడి, పోలీసు, మిలటరీ
శబ్దాలు స్త్రీ లింగమని
స్తనములు పుంలింగమని తెలుసుకొని
హిందీ తనకి రాదని వదిలివేశాడు'

ఇంతటి సునిశితమైన చెణుకు మరొకటి వుంటుందా? హిందీభాషోన్మాదుల మీద వజ్రాయుధాన్ని వదిలారు రెడ్డిగారు.

'శ్రమ తప్పించడానికి
ఆమె హోటల్‌లో దిగింది
ఆతిథ్యమునిచ్చే గౌరవము నుండి
మమ్ము వంచించింది'

ఈ ముక్తకము పైకి అతి సామాన్యంగా ఉంది కాని నాలుగు పాదాల వెనుక నవనీత హృదయం వుంది. స్నేహ మాధుర్యం కోసం పరితపించే హృదయాన్ని 'వంచించింది' అనే ఒక్క మాటలో ఇమిడ్చేశారు.

గోపాలరెడ్డిగారు రాజాజీ శిష్యులు, అభిమానులు. ఆయనకి రాజాజీ అంటే ఎంతో గౌరవం, పూజ్యభావం. రాజాజీ ప్రభావం యీ పద్యంలో కన్పిస్తుంది...

'సకల రోగాలకు మూలము నాలుకే
సర్వ కలహాలకు జన్మభూమి నాలుకే.'

ఇది పిన్నలూ, పెద్దలూ అందరూ గ్రహించవలసిన పరమ సత్యం.
కన్నీళ్లని ఎందరో కవులు ఎన్నో రకాల వర్ణించారు.

'విరహిణి నిశీథిని కార్చే
కన్నీటి బొట్లే
మిణుగురు పురుగుల వెలుగులు.'

మిణుకు మిణుకు మనే ఆశా నిరాశల వయ్యాలతో పాటు, ఆ కన్నీటి బొట్లలోని తళుకులని కూడా చెపుతున్నారు కవి.

'చీరెకు అంచు మాదిరి
అలలు సముద్రానికి అంచులు
అంచులలోనే అలలు కుచ్చెళ్ల మాదిరి ఎగిరేవి
నడి సముద్రంలో లేవు తరంగాలు.'

ఎంత లోతైన పరిశీలన! ఈ ఒక్క ముక్తకం తీసుకొని చాలా రకాల భాష్యం చెప్పవచ్చు. ఎవరి మానసిక పరిధిలో వారు యిందులోని రసమాధురి చూడవచ్చు.

అలాగే, సృష్టి సౌందర్యం, చైతన్యం ఒక బాలిక గమనంలో చూస్తున్నారు గోపాలరెడ్డి గారు.

'ఇంటి అమ్మాయి పరుగిడుతుంటే
అందాల వాగులా వుండేది
నిలిచియుండే పద్మాల కోనేరుగా వుండేది.'

రాజకీయాలమీద, యుద్ధాలమీద ఎన్నో చెణుకులు.

'విశ్వ శాంతికై
ఘోర సమరాలు జరుపుతారు
సమరాల గర్భంలో
శాంతి పిండాలకై వెదుకుచు నుంటారు.'

వీరిలోని రాజకీయ వేదాంతం అక్కడా అక్కడా ఒక చురక వేస్తూ వుంటుంది.

అపూర్వమైన జీవితానుభవంతో గోపాలరెడ్డి గారు అన్ని విషయాలను స్పృశించారు. తమ అనుభవాలను కావ్యవస్తువులుగా తీసుకొని, కవితా విన్యాసాలు జరుపుతూ, తనను తాను మర్చిపోక, తనపైనా తూణీరాలను విసురుకున్నారు.

'భీష్ముని వలె ఉత్తరాయనమునకు
ఎదురు చూస్తున్నాను
శాంతి పర్వపు ఉపదేశములను
గరపుచున్నాను...'

మరొక చోట.

'జీవిత గ్లానుల మరచుటకు
ప్రేమ స్మరణ మురళిని మ్రోయిస్తాను
సంకటాల కంటకాలను దాటుటకు
సుళువు మార్గము ప్రేమ మార్గమే' అంటారు-

గోపాలరెడ్డిగారిని చూసినపుడల్లా నాకు అసంఖ్యాకమైన ఆట వస్తువులు చుట్టూ పోసుకుని, ఏవొక్క బొమ్మనీ విడవలేక అన్నిటితో ఒకేసారి ఆడుకోవాలని ప్రయత్నించే పసివాడు జ్ఞాపకానికి వస్తాడు.

అసంఖ్యాకమైన అనుభూతులు, సంఘటనలు, అనుభవాలు కలిగిన పరిపూర్ణమైన విస్తృత జీవితం గోపాలరెడ్డి గారిది. ఈ అనుభూతుల సౌరభం ఆయనని రకరకాల పరిమళాలతో చుట్టుముట్టి వుక్కిరి బిక్కిరి చేస్తున్నపుడు వాటికి కవితా రూపం యిస్తున్నారు. అందులో అన్నీ అపూర్వం కాకపోవచ్చు. కాని ఆ సౌరభ సుగంధాల్లో మాత్రం కల్తీ లేదు; డాంబికమూ లేదు, హృదయాన్ని సూటిగా తాకగల నిర్మలత - నిజాయితీ వున్నాయి. వీరి కవిత్వంలో భావాలు వర్షానికి ముందు వచ్చే తూనీగల్లాగ, గబగబ తిరుగుతూ వుంటాయి. భాషకి వెతుక్కోకుండా ఆ క్షణానికి తోచిన మాటను వాడుతుంటారు. అందుచేతనే అనేక భాషల సమన్వయం కనిపిస్తూ వుంటుంది వారి కవితలో.

గోపాలరెడ్డిగారి కవిత్వంలోని మరో ముఖ్య విషయం ఏమిటంటే— సంతృప్తి, ప్రశాంతత, పరిపూర్ణత, కనిపిస్తాయి. ఎక్కడా దూషణగాని, లోకంమీద కోపంగాని, అసంతృప్తిగాని కానరావు. జీవితానుభవసార సౌగంధికంలా ఆయన తన అనుభూతులను ముక్తకాల రూపంలో ఆర్ద్రతతో, హృదయ స్పందనతో సమర్పిస్తున్నారు.

పసివాని మనస్తత్వంగల వీరిలో పిల్లవానికి వుండే పెంకితనం, భాష విషయంలో వుంది. 'నేను నెల్లూరివాడిని. మా ప్రాంతపు వాడుక పదాలే వాడుతాను. మీ భాషే ప్రామాణికం అని ఎక్కడుంది?' — అని నాతో అనేక సార్లు వాదించారు. వారి వాదనలో బలమూ, నిజాయితీ రెండూ వున్నాయి.

గురజాడవారి కన్యాశుల్కంలోని భాషనీ, నండూరివారి 'ఎంకి' భాషనీ సాహిత్య పరంగా అంగీకరించినమీదట నెల్లూరీయుల తెలుగు కాదనగలవారెవరు? కొంత కాలం పోయాక గోపాలరెడ్డిగారి ప్రత్యేకతగా తెలుగు కవితలో యిది నిల్చి పోవచ్చు.

సమకాలీను లెప్పుడూ కవినీ కవిత్వాన్ని ఆదరించకపోవటం మన సంప్రదాయం. ఆనాటి మహామహులకే తప్పలేదు. గోపాలరెడ్డి గారి 'ఆమె', కృష్ణ శాస్త్రిగారి 'ఊర్వశి' లాగా, నండూరి వారి 'ఎంకి' లాగా తెలుగు సాహిత్యంలో ఒక ప్రత్యేక స్థానం పొందుతుంది అన్నది యిప్పుడు చెబితే కొందరికి నచ్చక పోవచ్చు — కాని ఆ ఆశాభావం నావంటి చాలామందికి కనిపిస్తున్నది. సాహిత్యంలో కవికి గల స్థానాన్ని నిర్ణయించేది ఆ కవిత్వం చదివి ఆనందించే పాఠకులు గాని విమర్శకులు కాదు.

మద్రాసు
15-7-82

మాలతీ చందూర్.

# విహంగ వీక్షణం

## (ఆమె - ఆమె జాడలు - ఆమె నీడలు - ఆమె తళుకులు - ఆమె చెణుకులు)

శ్రీ గోపాలరెడ్డి గారి భావనా స్రవంతిలో సహస్రదళ పద్మంగా విరియ పూచినది - 'ఆమె'ల పంచకావ్య కన్యక. అవి వేయి సోయగములుగా వెల్లి విరిసినవి.

1977 లో - ప్రథమంగా - ముత్యమంత పదాలతో ఊపిరిపోసి 'ఆమె'గా కవితా కన్యకను సాక్షాత్కరింప చేసుకొన్నప్పుడు - బహూశా వారు అనుకొని ఉండరు - ఇంకా ఇన్ని 'ఆమె'లకు అక్షర మాలికా తోరణం కట్టగలనని !

నండూరివారి గుండె గొంతుకలో కొట్లాడి, సాకారమైన ప్రణయ భావంగా రూపు పోసుకునే వరకు 'కూసింత సేపైనా కూకుండ నీయలే'దట ఎంకి ! ఉర్దూ, పర్షియన్ సాహితీ సంప్రదాయాన్ని తెలుగువారికి అంద చేయా లనే భావనతో ప్రారంభించిన 'ఆమె' అంతటితో కవిని వదిలిపెట్టలేదు. సహస్ర అవతరాలుగా సాక్షాత్కరించి సహస్రానికి మించిపోయే ముక్తసరి ముక్తకాలుగా అవతరించే వరకు - విసిగిస్తూనే ఉంది !

సాకీ ప్రణయతత్వం ప్రతిబింబించే ఉర్దూ, పర్షియన్ భావాలను మెరుపు తునకలుగా తెలుగులోకి తేవటంతో ప్రారంభమైంది 'ఆమె'. ఆ తరువాత - 'ఆమె జాడలు'లో, 'ఆమె నీడలు'లో, 'ఆమె తళుకుల'లో, 'ఆమె చెణుకుల'లో కొత్త ఊహలు సాగాయి. కొత్త పోకడలతో, వస్తు వైవిధ్యంతో - ఆమె పద్యకాలు కవి లేఖిని నుండి ధారగా ప్రవహించి వచ్చాయి.

చెరుకు రసం కన్నా. తేనెకన్నా, చక్కెర పాకం కన్నా, మధురమైనది కవితా రసాస్వాదనం. గోపాలరెడ్డిగారి కవితా గోష్ఠులలో పాల్గొనే అవకాశం, అదృష్టం - కొన్ని సందర్భాలలో నాకు కలిగింది. ఈ 'ఆమె'ల అయిదు కవితా ఖండికలకు విహంగ సమీక్ష వ్రాయమని గోపాలరెడ్డిగారు నన్ను ఆదేశించారు. ఆ సారస్వతావలోకనం చేయటానికి, నాకు అర్హత ఎంతవరకు ఉన్నదా అని నాలో నేను వితర్కించుకొన్నప్పుడు 'ఆమె' లో వారు వ్రాసిన ఈ చిన్న కవితే సమాధానంగా తోచింది.

> ''సౌందర్యము కోరేది
> విలువ గుర్తించే రసికత్వము
> కవిత్వము అంతే!''

ఇలా - కొంత కాలంగా — గోపాలరెడ్డిగారి కవితలతో నాకు పరిచయం ఉండటం, అందులోని రసౌచిత్యాన్ని గురించి తర్కవితర్కాలు చేయడం — జరుగుతూ ఉండినందున—వారు నన్ను ఈ కవితా దర్శనం చేయమని అడగడం సహజంగానే తోచింది. కావ్యానందం పొందగలగటమే అర్హతగా వారు నాకు ఈ పనిని వప్పగించినందున — నేను చేయగల పని విహంగ సమీక్ష కాక — విహంగ వీక్షణం మాత్రమేనని వారికి మనవి చేసి, ఈ పనికి ఉపక్రమించాను.

మంచి కవిత్వం విన్నప్పుడు వొంట్లోకి కొత్త ఊపిరి వచ్చినట్లు ఉండాలి శీతల తుషారం మనస్సును తాకినట్లుండాలి! కవితాశక్తి హృదయంలో జ్యోతిని వెలిగించినట్లుండాలి!

గోపాలరెడ్డిగారి కవిత్వం ఇవన్నీ చేయడంతో పాటు ఒక హాస్య లాస్యంతో మనస్సును గిలిగింతలు కూడా పెడుతుంది. భావనలో ఒక రమ్యమైన లాలిత్య రేఖ కదిలి 'ఓహో' అని అప్రయత్నంగా అనుకునేట్లు చేస్తుంది.

''నేను కవితా సభలోకి ఆలస్యంగా వచ్చాను, కూర్చోడానికి చోటు దొరికింది'' — అని వ్రాసుకున్నారు గోపాలరెడ్డిగారు - 'ఆమె జాడలు' ముందు మాటలో. డెబ్బై సంవత్సరాల వయస్సువచ్చాక వారు స్వీయకవితలు వ్రాయడం ప్రారంభించడం చూస్తే — వయస్సుకూ మనస్సుకూ సంబంధం తక్కువ కాబోలు - అనిపిస్తుంది!

స్వంత రచనలతో వారు కవితా సభలోకి ఆలస్యంగా అడుగు పెట్టినా, చాలా కాలం క్రిందటే రవీంద్ర సాహిత్యాన్ని తెలుగులోకి అనువదించి, తెలుగు వాణికి తొడవులు పెట్టినవారే!

ఒక కవి రచనలను పరామర్శిస్తున్నప్పుడు - ఆ కవి సంపూర్ణ సాహిత్య కృషిని, వ్యక్తిత్వ ప్రాభవాలను, ఆలోచనలను, జీవన గమనాన్ని - లెక్కలోకి తీసుకోవడం ఆచారం. అవసరం కూడ. ఆ విధంగా - మనం వెనక్కి వెళ్ళి ఒక్కసారి సింహావలోకనం చేసుకుని - ఆ తర్వాత 'ఆమె' లోని అందాలను దర్శించుకుందాం.

గోపాలరెడ్డి గారు దొడ్డ వంగణంలో పుట్టారు. శాంతి నికేతనంలో హృదయ సంస్కారం పండించు కున్నారు. రవీంద్రుని శిష్యరికంతో విశ్వ జనీన దృక్పథం అలవరచుకున్నారు. బహు భాషా పరిచయము కలిగించుకున్నారు. స్వరాజ్య సమరంలో వీర సైనికుడిగా ముందుకు దూకి, చెరసాల జీవితం రుచి చూశారు. ఆ తర్వాత మంత్రిపదవులూ రాజ్యపాలక వైభవాలూ అనుభవించి అనంతమైన అనుభవాన్ని పండించుకున్నారు.

చాలా కాలం రాజకీయ రంగంలో ఉన్నా, రవీంద్ర కవీంద్రుని వద్ద శిష్యరికం చేసినప్పటి వాసనలు రెడ్డిగారు పోగొట్టుకోలేదు. అధికారం చాలా మందిని మదాంధుల్ని చేస్తుంది. కాని, గోపాలరెడ్డిగారు ఆ అధికార ఆడంబరాల దుందుభుల మధ్య నుంచి తప్పుకుని సరస సంగీత సాహిత్య పిపాసిగా అవతారం ఎత్తారు!

రవీంద్రుని బెంగాలీ వచన, పద్య కావ్యాలను, నాటకాలను, ఇక్బాల్ ఉర్దూ కవితలను - సుమారు నలభై సంవత్సరాల క్రిందటే తెలుగులోనికి అనువదించి గోపాలరెడ్డిగారు తమ బహు భాషా పరిచయాన్ని సార్థకం చేసుకున్నారు.

"నా సాహిత్య వ్యవసాయము రవీంద్ర సాహిత్యపు మాగాణములోనే, అదే నా లక్ష్యము. అదే నా సంతుష్టి" (తాజ్ మహల్) – అని ఆనాడు చెప్పు కొన్న గోపాలరెడ్డిగారు 1977 నుంచీ నవ్య సాహిత్యపు పంటలను పండించడం ప్రారంభించారు. 'కవితా ప్రాంగణములో నవీనుడను' - అంటూనే - నాలు

గయిదు ఏళ్లలో అయిదు ముక్తసరి కవితా ఖండికలు - నాలుగయిదు దీర్ఘ కవితా సంకలనాలు - ప్రచురించి - ఆధునిక తెలుగు కవితా వికసనంలో ఒక ప్రముఖ పాత్రనే వహించారు.

గోపాలరెడ్డిగారి వివిధ కవితా ఖండికలను పరిశీలిస్తే వాటి వెనుక రవీంద్రుని సాహిత్య ప్రభావం ప్రబలంగా కానవస్తుంది. చిన్న వయస్సులో విశ్వకవికి శిష్యులుగా ఉండగలిగిన సౌభాగ్య దీప్తిని వారి జీవితంలో, సాహితీ సంస్కారంలో - వెన్నెలమడుగుగా నింపుకున్నారు.

తమ స్వంత కవితల ఆవిర్భావాన్ని గురించి ముచ్చటిస్తూ గోపాలరెడ్డి గారే ఇలా అంటారు - "రవీంద్రుని వ్యక్తిత్వము - సాహిత్యము, సంగీతము - నన్ను సమ్మోహితపరచాయి. వారిని చూస్తూ ఉన్నప్పుడు, వింటూ ఉన్నప్పుడు- సాహిత్య హిమాలయాల పాద మూలమున కూర్చున్నట్లు అనిపించేది. నా విశ్వ భారతి కాలము నా జీవిత వసంత కాలము. ఆనాడు నాటిన విత్తనాలే '77 మే మాసంలో మొలకెత్తినవేమో !"

కొన్ని భావనలలో, భాషను మలచడంలో - గోపాలరెడ్డి గారి కవిత్వం పైన నిస్సంశయంగా రవీంద్రుని ప్రభావం ఉంది. వారిది బెంగాలీ కవితా పరిమళాలు నింపుకొన్న శైలి. వంగ భాషలో కొన్ని సంస్కృత పదాలు ఇమిడిపోయిన పద్ధతికీ, తెలుగులో సంస్కృత సమాసాలు ఏర్పడిన పద్ధతికీ కొంత తేడా ఉంది. కొన్ని చిత్రమైన సంస్కృత పదబంధాలు గోపాలరెడ్డి గారి తెలుగు కవితలలో చోటు చేసుకోవటానికి కారణం - వారి బెంగాలీ భాషా పరిజ్ఞానమే - అనిపిస్తుంది.

రవీంద్రుని 'లిపిక' ను 'వాన చినుకులు' పేరుతో అనువదిస్తూ - ఆ రచనా ప్రక్రియను గురించి గోపాలరెడ్డి గారు ఇలా వివరిస్తారు: "క్లుప్తంగా, సూక్ష్మంగా, మనసుకు వచ్చిన భావం వర్ణించటం - ఆ భావ శాబకములతో ఆట్లాడుకోవటం - ఆ ఆట తేలికైనది. ఏ నియమాన్నీ ఎరగనిది. ఆ ఆటకు పద్యం బరువే. గద్యం బరువే. ఆకాశంలో ఎగిరే గాలిపటం వలె, కొండ బొమ్మపై పారే నీటి సోనవలె, శ్రమ పడనిది, అలసట తెలియనిది, వచన పద్యాలన్నా, గద్య కవిత్వమన్నా సరిపోతుంది."

ఈ నాటి వచన కవిత్వం, మినీ కవిత - ఇంతగా ప్రాచుర్యంలోకి రాక మునుపే గోపాలరెడ్డి గారు చెప్పిన వివరణ ఇది. సరిగ్గా ఇదే నిర్వచనం- నలభై ఏళ్ల తర్వాత, వారు వ్రాసిన 'వేయి ఆమెలకు' వర్తించటం గమనార్హం.

'ఆమె'ల వరుసలు అన్నీ హ్రస్వ కవితా రూపాలు. కొన్నిటికి వాపీ వరుసా, శృతీ, లయా - ఉంటాయి. ఎక్కువ భాగం అచ్చ తెలుగు పలుకు బళ్ళతో నిసర్గ సుందరంగా ఉంటే, కొన్ని మాత్రం జటిల సంస్కృత పద గంభీరతతో నడుస్తాయి. ప్రణయ భావనకు, ప్రకృతి పరిశీలనకు, సౌందర్యా రాధనకు, లోక సహజ చిత్తవృత్తికి, కథా కథనానికి, శ్లేషార్థానికి, చమత్కారానికి, రాజకీయ విమర్శలకు - వేయికి పైగా ఉన్న ఈ కవితలలో స్థానం ఉంది. ఎన్నో భావ శాబకాలతో ఆటలాడుకుంటూ - చదువరులను కూడా ఆ ఆట ఆడేట్లు చేయటం ఈ కవితల లోని ప్రత్యేకత. ఈ కవితలలోని రుచినీ, రంగునూ, వాక్కునూ, అర్థాన్నీ, రసాన్నీ, రాగాన్నీ - ఒక్క విహంగ వీక్షణం చేసి చూస్తే ఎలా ఉంటుందో ఇప్పుడు చూద్దాం.

# 'ఆమె'

మధుపాత్రను చేతపట్టుకుని. మధుకీలవలె కూర్చున్న పారశీక ప్రణయిని- అట్టమీద అందమైన బొమ్మలో 'ఆమె' గా మనకు దర్శనమిస్తుంది. పుస్తకం తెరిస్తే-అడుగడుగునా అక్షరమాలికలలో కట్టుబడిఉన్న సాకీ-హేలగా నవ్వు తుంది. గాలిబ్, ఇక్‌బాల్-చదివిన జ్ఞాపకాలతో - సాకీ సుందరికి తెలుగువేషం వేసి, తెలుగువారికి 'ఆమె' లో పరిచయం చేయటానికి పూనుకున్నారు గోపాల రెడ్డిగారు. ఆమె భావ ప్రకటనలన్నీ ఉర్దూ పర్దా క్రిందవే! కొంతదూరం కవి నడిపించినట్లు నడిచిన ఈ ప్రణయ సుందరి-ఆ తర్వాత కవినే నడిపించింది. మేలిమి సొగసూ, మధురసాన్నీ ఆవలపెట్టి - అనేక రూపాల్లో కవికి దర్శనం ఇచ్చింది. ప్రకృతిగా, సమస్త లోకాల్లో ఉన్న సౌందర్యంగా, మూటకట్టి విడిచిన జ్ఞాపకాలుగా, కాచి వడపోసిన అనుభవసారంగా - హాస్యరసికగా - 'ఆమె'- అనంత వైవిధ్యం సంతరించుకుంది.

'ఆమె' లోని కవితలు ఎక్కువగా ప్రకృతికి, ప్రణయానికి సంబంధించి నవి. 'ఆమె'ను ఎన్నో రంగులలో, రాగాలలో, హేలా విలాసాలలో - దర్శించి వర్ణించటం - అన్ని భాషలలోని కవితా సంప్రదాయం. 'అతి మధురమైనది, అత్యంత ఆహ్లాదకరమైనది. శృంగార రసము' అని మన ఆలంకారికులు ప్రవచించారు. ప్రాచీన తెలుగు సాహిత్యంలో - శృంగారంలోని వివిధ దశలనూ - విస్తారంగా వర్ణించారు తెలుగు కవులు. నాయిక అంగాంగ వర్ణనతో పాటు, విప్రలంభ శృంగారాన్ని ఎంత వేదనతో వర్ణిస్తారో - సంయోగ శృంగారాన్ని అంత విపులంగా ప్రబంధ సాహిత్యంలో చొప్పించారు.

'ఆమె' ముక్తకాలను కవి ప్రధానంగా ప్రణయ భావోద్దీపనను ఆలంబనంగా తీసుకుని - ఉర్దూ సాహిత్య మర్యాదను పాటిస్తూ నడిపించారు. ప్రణయిని అందం - ఆమె ముఖాన్నీ, కన్నుల్నీ, చెంపల్నీ దాటి క్రిందకు రాదు. ఖండికలన్నీ వియోగ ముద్రను అద్దుకున్నవే! ఈ వియోగ వర్ణనలోనూ తెలుగు ఉర్దూ సాహిత్య రీతులలో తేడాలున్నవి. తెలుగు నాయిక విరహ జ్వాలలలో వేగిపోయే విరహిణి కాని, గోపాలరెడ్డిగారు తెలుగువారికి పరిచయం చేసిన సాకీ - ఒక దీపం వంటిది. ఆమె చుట్టూ శలభంలా తిరిగి, విరహంలో వేగి, మాడిపోతాడు ప్రేమికుడు. ప్రేయసి - అతడిని ఆటలు పట్టిస్తుంది, విసిగిస్తుంది, హేళన చేస్తుంది, అంగీకరించినట్లే నటించి, అతడి ముఖం మీద భళ్లున తలుపులు మూసి వేస్తుంది దర్వానుచేత మెడపట్టి గెంటిస్తుంది. అతడు ఆమె చేతిలో గాలిపటం వలె ఊగుతాడు. ఆమె నిర్దయకు ఎంతబాధ పడినా, ప్రేమించటం మానుకోడు. ఆమె ఉపేక్ష అతడిని ఇంకా గాఢ విరహంలో ముంచుతుంది.

ఈ చిత్రమైన ప్రణయ భావాన్ని తెలుగువారికి ఇంపుగా ఉండేటట్లు కవిత్వం చెప్పటం సామాన్య విషయం కాదు. ఇతర భాషా సంప్రదాయాన్ని తెలుగులోకి తేవడం - కవికి గల శిల్ప చాతురిని చాటుతుంది.

అసలు 'ఆమె' ఎలా ఉంటుంది? ఎలా నర్తిస్తుంది?

మొగ్గ పువ్వుగా వికసిస్తుంది. ఆ పువ్వు తిరిగి మొగ్గ కావటం అసంభవం.- కాని-

'భళిరే ! ఆమె పెదవులు
కొన్ని వేళల మొగ్గలు
కొన్ని వేళల పువ్వులు !'

ఆమె మూతి ముడుపూ, మూతి మెరుపూ చెప్పకనే చెప్పటం కవి గడుసుదనం.

స్త్రీ కన్నులు ఆకర్ణాంతాలు. ఆమె కమలాక్షి, చంచలాక్షి-ఇవి అన్నీ ఎరిగిన వర్ణనలు - కాని-

"నీ కన్నులు మబ్బులు
నీరు ఉంది మెరుపు ఉంది"

అనటంలో తరళత ఉంది. ఆర్ద్రత ఉంది.

ఆమె కేశబంధాలను ముచ్చటైన మూడు మాటల్లో బంధించిన తీరు-

"ఆమె కేశబంధాలు
చీకటి వాగులు
కురుల ఉంగరాలు - అలలు"

ఆమె పైటకొంగును గురించి—

"సగము జారిన కొంగు
గాలిలో ఎగురుతుంది
మన్మథుడితో రాజీకి
ఎత్తే తెల్లజండాగా ఉంది !"

మన్మథుడితో రాజీకి రావడం-ఆమెలో ప్రణయాంకురాలు మొలిచినవన్న మాటకు నిదర్శనం. తెల్లజండా అనటంలో - ఆమె తెల్లజండా ఎత్తటం మన్మథుడితో ఓడిపోవటానికి సంకేత . ఆమె తెల్ల చీర కట్టిందని ధ్వని. కవికి ఊహాబలంతోపాటు, దానిని ప్రకటించే శిల్పనైపుణ్యం ఉన్నదని చెప్పటానికి ఈ ముక్తకం చాలు.

'ముఖ ఫలకమున
తీర్చిదిద్దిన తిలకము

చంద్రమండలమున
బ్రద్దలైన అగ్నిపర్వతముగ నున్నది'.

ఆమె ముఖ చంద్రుడిలో అగ్నిపర్వతం బ్రద్దలైనదట. ఇది ఒక కొత్త కల్పన.

'ఆమె'ను వర్ణించటం ఇంతవరకే. కన్నుల ఆర్ద్రతను, శిరోజాల కుటిలత్వాన్ని, జడలోని పూలను, పెదవులు విచ్చినప్పుడు మెరిసే దంతాలను-మించి-ఆమె శరీరంలో మరే ఇతర భాగాన్ని వర్ణించటానికి పూనుకోడు కవి.

ఇంత సుతారమైన సుందరిపట్ల ప్రేమికుడి భావన కూడా సున్నితమైనదే!

''ఆమె తోటలోనికి
వస్తేనే వసంతం
మొగ్గలన్నీ
బాగా పూశాయి''.

అనుకుంటాడు పిచ్చి ప్రేమతో! ఆమె స్నానానికి చెరువుకు వస్తే-అంతకు ముందు కరగబోసిన వెండిగా ఉన్న చెరువు కరగబోసిన బంగారుగా మారిందట! ఆమె దేహకాంతిని ఇలా సూచ్యంగా వర్ణించి-పాఠకుల ఊహ సుళ్లు తిరిగేట్లు చేస్తాడు కవి.

ప్రాచీన కవికి స్త్రీ - శృంగార మూర్తిగా, విరహార్తగా, కాముకిగా కనిపిస్తే-ఈ కవి- భావకవుడందుకి మల్లేనే- ఆమెను ప్రణయినిగా, హృదయేశ్వరిగా, స్నేహితురాలిగా భావించి సంభావిస్తాడు. వర్ణన విషయంలో-ఎక్కడా ఔచిత్యానికి భంగం కలగనీయక పోవడం కవి సంస్కారాన్ని వెల్లడి చేస్తుంది ఈ విషయాన్నే-'ఆమె' లోనే ఒక కవితలో—

''కల్పనా విహంగము
ఎంత ఎత్తుకు ఎదిగినా
ఔచిత్యపు గూటి మీదనే
దాని చూపు''—

అని చెపుతారు.

ఎంతటి రసజ్ఞతా, సౌందర్యారాధనా ఉన్నా - ఆ కళాతృష్ణ సిద్ధింప చేసుకోవలసిందే కాని, భంగం చేసుకోవలసింది కాదని వార్నింగు ఇస్తూ-

"సౌందర్యోపాసన
విశ్వామిత్రుని తపస్సు వంటిది
సిద్ధించి బ్రహ్మర్షిత్వం ఇస్తుంది
భంగమై నిస్సహాయ శకుంతలను పుట్టిస్తుంది" - అంటారు !

సౌందర్యం పట్ల ఆరాధన ఉండటం కవి లక్షణం. ఆ సౌందర్య తృష్ణ ఎటువంటిదో, దానివల్ల కలిగే లాభనష్టాలు ఏమిటో-కవి వేదాంతిలా చెపుతాడు- ఇలా-

"సౌందర్య తృష్ణ
మృగతృష్ణల వేట
వెంటాడే కొద్దీ
దప్పిక మిగులుతుంది".

కాని, కవి హృదయానుభూతికి హద్దులు ఉండవు. ప్రేమకు పరాకాష్ఠ న్యాయంగా అయితే ఆనంద స్వరూపం కావాలి! కాని ఇక్కడ ప్రాణ దఘ్నమైన ప్రేమ! 'దీపము వంటి సౌందర్యాన్ని ప్రేమ శలభము వలచి వచ్చి అసువులను అర్పిస్తుం'దట !

ప్రేయసి పట్ల కలిగిన వివశత్వంతో దేవుడినే మరిచిపోతాడు ప్రేమికుడు. ఈ విషయాన్ని కరుణంగా, సరళంగా, కవి చెప్పిన తీరు-

" నీపేరే
జపమాల మీద
తిరుగుతుంటుంది
దేవుణ్ణి మరిచిపోయాను".

వియోగం విచిత్రమైనది. అది ప్రేయసీ ప్రియుల మధ్య కావచ్చు, స్నేహితుల మధ్య కావచ్చు, ఆప్తుల మధ్య కావచ్చు. వియోగం దుర్భరమైనదే అయినా కవికి అదే ఇష్టమట! ఎందుకంటే-

"సంయోగములో
పోతుందని భయం
వియోగములో
వస్తుందని సంతోషం".

ఈ వివేచన వియోగాన్ని మధురతరంగా చేస్తుంది.

విరహంలో దుఃఖం ఉంటుంది. కన్నీళ్లు వస్తాయి. ఆ విరహాశ్రువుల వేడి ఎన్ని డిగ్రీలలో ఉందటా!

"నా కన్నీటి బొట్లు
ఆమె చేతుల మీద పడి
బొబ్బ లయ్యాయి".

ఎంత పొదుపు మాటల్లో! ఎంత అగ్ని ఆ కన్నీటి బొట్లలో!

ఆ సాకీ మధుర మానస కాకపోయినా, మదిర లాలస మాత్రం అవును. ఆ మదిరను అందరికీ పంచి, తన వంతుకు వచ్చేటప్పటికి-అయిపోయిందని కళ్లు విప్పి నవ్విందట' అప్పుడు - ఆ ప్రేమికుడు అనుకుంటాడూ!

"అదే చాలు
వాళ్లకు సురుగు కల్లు
నాకు
నవ్వే కళ్లు."

హాలాహలం—మన కళ్లముందే కరిగి, సురిగి-రసామృతంగా మారేటట్లు చేయగల కవి ప్రతిభకు ఈ నిదర్శనం చాలు!

విరహాతురుడికి ప్రకృతి అంతా తనతో జతకలిపి వంత పాడుతున్నట్లే అనిపిస్తుంది. మన కవుల కల్పనలో—విరహి జనానికీ, చంద్రుడికీ, పుష్పబాణాలకీ, వెన్నెలకీ—ముడి పెట్టడం సంప్రదాయం. ఇందుకు భిన్నంగా—విరహ విలాసాన్ని ప్రకృతి ప్రలాపంగా కవి ఊహించి-గుండెలు బ్రద్దలయేట్లు చెపుతాడు ఇలా—

"జలపాతమా, నా వలెనే
దినమంతా విలపిస్తావు

రాత్రంతా రాతి బండకు
నెత్తిని మోదుకుని మోదుకుంటున్నావు!''

భావకవుల పోకడా—ఉర్దూ పరిచయమూ కలుపుకొని ప్రణయభావనలు కదిలినా — అచ్చంగా తన స్వంత ఊహలు, శైలితో కవి నడిపించిన కవితలు 'ఆమె'లో కనిపిస్తాయి. ప్రకృతి పులకరింతలను పలకరిస్తాడు కవి-సమార్ద్రంగా!

''పూర్వదిగంతాన
శుక్రతార ఉదయించింది
ఉషాదేవి వచ్చే బంగారు బాటలో
ఏర్పాటైనది వెండి పల్లకి''

ఉషోరేఖతోపాటు ఉదయించే శుక్రతార - కవి ఊహలలో ఎన్నో చోట్ల ఎన్నో రకాలుగా రూపు దిద్దుకుంటుంది.

ప్రకృతికీ ప్రణయానికీ ఉండే సంబంధం, కవిత్వానుభూతికి స్పందనను ఇస్తుంది. ప్రకృతి-స్త్రీ - ఈ ఇద్దరూ - సత్యానికి, సౌందర్యానికి - ప్రతిబింబ రూపాలు. ఈ సౌందర్యంలో ఉండే సత్యాన్ని, సత్యంలో ఉండే సౌందర్యాన్ని- ఒక తన్మయీ భావంతో గోపాలరెడ్డిగారు దర్శించి-'ఆమె' అనే కవితాఖండికలో చిత్రం కడతారు. ప్రణయంతో, ప్రేమతో, స్నేహంతో, కళాత్మక దృష్టితో నిండిన ఆ సత్యసౌందర్యాన్ని-మనముందు కూర్చుని ఆశుకవిత చెపుతున్నట్లు ఆవిష్కరిస్తారు.

ఒక్కసారి కంఠమెత్తిపాడిన కోయిల అంతటితో విరమించదు. కొసరి కొసరి రాగం తీయటం దాని ధర్మం. కవికోకిల కంఠం కూడా అంతే! ప్రేమను గురించి కవి పరిశీలన ఇలా ఉంది.

''చందన తరువును
నరికేకొద్దీ సువాసన
ప్రేమను తరచేకొద్దీ
మధుర వేదన''

ఈ మక్కల్ని మరొక దృష్టితో తిరగవ్రాసుకుంటే,

''చందన తరువును
నరికేకొద్దీ సువాసన
తరచేకొద్దీ
సాహిత్యపు సంవేదన''

'ఆమె'ను సృష్టించినతర్వాత – ఈ సంవేదనతోనే మరికొన్ని కవితలను వ్రాసి-గోపాలరెడ్డిగారు 'ఆమె జాడలు'గా మనకు అందించారు.

# 'ఆమె జాడలు'

ఆధునిక కవి ఏ సాహిత్యనియమానికీ బద్ధుడు కాడు. తన కావ్యవస్తువును ప్రకృతినుంచీ, జీవితంనుంచీ, మానసిక అనుభూతులనుంచీ ఏరుకుంటాడు.

సూఫీ ప్రణయతత్వ ధోరణితో ప్రారంభించి 'ఆమె'తో మొదలైన గోపాలరెడ్డిగారి కవిత్వధోరణి-అటుతర్వాత మరికొంత విస్తృతమైన దృక్పథంతో సాగింది. తదేకమైన భావనాబలంతో కవి సృష్టించుకొన్న ఆమె – ఆ తరువాత 'ఆమె జాడలను' నిజంగానే వదులుతూ కదిలింది. కాని – ఆ జాడలు అన్నీ 'ఆమె'వే కావు.

''మనస్సులో పొర్లుతు మెదిలే భావాలే
కాలిజాడల వదిలాయి నా పదాలలో !''

అన్న కవి మాటలు నిజం. ఆ మనస్సులో మెదిలి-కవితారూపం దాల్చిన భావాలు అనేక అంశాలకు సంబంధించినవి. హాస్యోక్తులు, జరిగిన ఉదంతాలు, వ్యంగ్యవిమర్శలు, రాజకీయ ధోరణులు జరా మృత్యువులను గురించిన తాత్విక చింతనలు-ఇవన్నీ-'ఆమె జాడల'లో మనకు కనిపించే కవితాత్మ వదిలిన జాడలు.

అన్నీ హ్రస్వ ముక్తకాలే అయినా - ఇందులో కథనం చెప్పినట్లు సాగిన ఏడు ఎనిమిది వరుసల కవితలు కూడా చోటు చేసుకున్నాయి. ''నాకు ఇష్ట

మొచ్చిన అన్నివిషయాల మీద వ్రాశాను'' - అని తన ముందుమాటలో కవి-తనకుగల స్వేచ్ఛాప్రవృత్తిని నిజాయితీతో చెప్పుకుంటారు.

''జీవిత సమస్యల్ని మరిచిపోవటానికి
ప్రేమ జ్ఞాపకాల వేణువును పూరిస్తాను''

అన్న కవి మాటలలో-ముందుగా స్ఫురించేది ఇది ప్రేమకవిత్వం కాబోలు నని ! కాని, ఆ ప్రేమ-ప్రణయపరమైన పరిధిని దాటి, స్నేహపు చెలియలి కట్ట దాటి, ప్రకృతి విలాసాలను అధిగమించి, విశ్వంభరతను సాధించిందని చెప్పుకోవటానికి ఈ కవిత నిదర్శనం-

''ఆమెను నేను ప్రేమించగానే
ప్రపంచాన్నే ప్రేమిస్తున్నానని తోచింది
ఉదార విశాల మధురతే
సర్వత్రా గోచరించింది''

ప్రపంచాన్ని ప్రేమించగల కవి విశ్వాత్మను గుండెలో పదిలపరచుకో గలిగిన దిట్ట. ఈ విశ్వ సౌందర్యాన్ని తన ప్రణయ భావనతో ఈ విశ్వమానవత్వాన్ని తన కవితలలో- కవి రూపకల్పన చేసిన తీరును కొంత సంభావించు కుందాం!

''ఆమె నిలిచి ఉంటే అచపల సౌదామిని''—అంటూ

ఆమెను వర్ణించుకున్న కవి- రోగగ్రస్తయై కృశాంగి అయినప్పుడు కూడా భావుకతతో ఆమెను పరామర్శించటం మానలేదు. 'తూర్పుదెస వేకువన పొడకట్టే బహుళ త్రయోదశి చంద్రుణ్ణి సూచిస్తున్న'దట ఆమె'

ముఖాన్ని గగనంతో, అధరాన్ని కులాయముతో పోల్చటం ఒక కొత్త భావన. 'స్మితము' అనే పక్షి రెక్కలు విప్పి అధర కులాయమును వదిలింది- అనటం సర్వజనామోదకరమవుతుందో కాదో కాని, సర్వ సామాన్యమైన వర్ణన మాత్రం కాదు!

ఎండాకాలాన్ని ప్రాచీన ఆధునిక కవులు ఎన్నో రకాలుగా వర్ణించారు. విష్ణుమూర్తి సముద్రంలో మకాం పెట్టడం, శివుడు గంగను నెత్తిమీద పెట్టుకోవడం, బ్రహ్మ పద్మంలో పుట్టడం— ఇవన్నీ గ్రీష్మతాప భయంతోనేనట (కుమార సంభవం). కాని, ఈ కాలంలో మానవ మాత్రులకు ఇవి సాధ్యమయే పనులు కావు కదా! మనవాళ్లు మధ్యాహ్న వేళలో మంచం వేసుకుని కొంతసేపు ఉసురసురంటూ విశ్రమిస్తారు "గ్రీష్మ మధ్యాహ్నవేళల విశ్రమించిన పసిడి వన్నెల తలిరుబోడిని" ఎప్పుడో చూచారు గోపాలరెడ్డిగారు. వారి కవిహృదయం ఆ దృశ్యాన్ని ఇలా రూపు కట్టించుకుంది.

"బయట వెండి కరగ బోశారు
ఇంట బంగారు అచ్చు బోశారు!"

మధ్యాహ్న సూర్యతేజాన్నీ, ఆమె బంగారు దేహ కాంతినీ కలిపి ద్వయీ భావంతో కవి చేసిన స్వతంత్ర కల్పన ఇది.

నీడలు వెంటపడటం మన అందరకూ తెలుసు కాని- ఆ నీడకు ఊపిరి పోస్తే ఎంత హాయిగా ఉంటుంది- అనేది కవి భావన. ఆ నీడ తాను ప్రేమించిన ప్రియురాలిది. "ఆమె నిడుపైన నీడ భుజాలమీద సోలితే - నీడకే ఊపిరి ఉంటే ఎంత హాయిగ ఉండేదో" అని భావిస్తాడు. ఆ నీడకు ఊపిరి పోయగల మన శ్శక్తి కవికి ఉంటుంది.

ఒక సాయంవేళ స్నేహితురాలి భుజాన చేయిమోపి వస్తున్న 'ఆమె' - కవి దృష్టికి- శుక్రతార భుజాన చేయివేసి నడుస్తున్న సంధ్యాదేవి వలె తోచింది! ఇది ఎంత మనోహరమైన కల్పన!

నిత్యం ఎందరితోనో పరిచయం కలగడం మానవ జీవిత గమనంలోని ఒక ముఖ్య భాగం. కొన్ని పరిచయాలు మాత్రమే గట్టి పునాదులతో సౌధంగా నిలుస్తాయి. ఆ పరిచయాలు చెలిమి కలువలు పూయవచ్చు. వలపు పంటలూ పండించవచ్చు.

పరిచయపు పాతప్రేమ్మిదలో
వలపు
క్రొత్త నూనెను పోసింది!

క్రొత్త నూనెతో, వత్తులతో, వెలిగించిన వలపుదీపం- కొంత కాలానికి, కందకాలను దాటి, ప్రియా దుర్గమును చేరే శార్దూలమై రూపాంతరం చెందుతుంది! ప్రేమను శార్దూలంతో పోల్చిన కవులు ఉన్నారా? ఏమో!

గుండెలో ప్రేమ పుట్టడం ప్రేమికులకు ఒక వ్యాధో, లక్షణమో కావచ్చు. ఏదైనా కానీ, 'ప్రేమ మురళీ రవాన్ని ఆలకించి గుండె పుట్టలో పాము పడగ విప్పి లేచింద'ని కవి సమయం. నాగస్వరానికి పాము ఆడటం అందరకూ తెలిసిన సంగతి. మురళీరవంతో పామును ఆడించే ప్రజ్ఞ గోపాలరెడ్డిగారికే చెల్లింది!

ప్రేమ ఉన్నచోట విరహం ఉంటుంది. ఆ విరహాన్ని మన పూర్వకవులు చిత్రాతిచిత్రంగా వర్ణించారు. ఆ వర్ణనలలో మదన వికారాలే ఎక్కువగా చోటు చేసుకుంటాయి. కాని అధునిక కవి ఎంత సూటిగా, సున్నితంగా- రాత్రి తాను అనుభవించిన విరహాన్ని చెపుతాడో చూడండి!

''దీపాన్ని ఆర్పినాను
నిద్ర రాలేదు
ఆమె జ్ఞాపకాని కొచ్చింది
ఆమె తలపు పడవలే
విరహ సాగరములో తేల్చాయి''

ఇది-ప్రేమికులందరూ -ఎప్పుడో ఒకసారి అనుభవించక తప్పని విరహ బాధ!

''పడుకుంటె నాకేదొ భ్రమ పుట్టినాదీ
రథుపులో సెయ్యేసి కలిపేసినాదీ''

అంటూ- ఇదే భావాన్ని నాయుడుబావ తనకు తెలిసిన భాషలో చెప్పుకుంటాడు!

బాహ్య సౌందర్యాన్ని మించింది ఆత్మ సౌందర్యం. సౌందర్యాన్వేషకుడైన కవి ఉత్తుత్తి వేషభాషాలంకారాలను చూచి మోసపోడు! బాహ్యరూపం స్వభావ స్వరూపానికి జోహారులర్పించినట్లు భావన చేస్తూ- కవి ఒక చక్కని ఉపమ చెపుతాడు. కృష్ణుణ్ణి సౌందర్యానికీ- కుచేలుణ్ణి ఆత్మానుభూతికీ ప్రతీకలుగా నిరూపుకుని- కృష్ణుకు కుచేలుడిని సత్కరించినట్లు ఉందని వర్ణిస్తాడు.

'ఆకాశపు తల్లి మబ్బు అమ్మాయిలతో ఆటలు ఆడుకుంటుంటే సంధ్య కాగానే, సమీర కుమారులు అమ్మాయిలను పిలుచుకువెళ్లారు' అంటూ ప్రకృతిలో ప్రణయ భావదీప్తిని నిక్షిప్తం చేస్తారు. 'చీకట్లు ముదిరిన రేయి - పిట్టల జంట కూస్తే - నిశ్శబ్దపు వక్షాన్ని ముద్దిడినట్లు' ఉన్నదనటం కవి భావ శబలతకు తార్కాణం !

ఈ సంపుటిలో - చాలా చోట్ల హాస్యపు చినుకులు సాహిత్యపు జల్లులుగా కురుస్తాయి. బాధ, అసంతృప్తి, తిరుగుబాటుతనం, కోపం - ఈనాటి సాంఘిక వ్యవస్థలో నుంచి పుట్టుకువస్తున్న కవితలు. ఇవి మనకు అవసరమైన కవితలు. వీటికి విభిన్నంగా-అలిసిన మనస్సును కొంత సేద తీర్చేట్లు చేయగల శక్తి ఒక హాస్యపు చిలకరింపుకు ఉంది. ఒక చిన్న ఉదంతం కవితా రూపంలో చెప్పి, మనలను నవ్వించేట్లు చేయగల నేర్పు గోపాలరెడ్డి గారి కలానికి ఉంది. అధునిక కవితా మార్గంలో - ఈ క్రొత్త వొరవడి దిద్దినవారు గోపాలరెడ్డిగారు - అని చెప్పవచ్చు.

చేయి చూడమని కోరిందట ఆమె ! ముందు జరిగింది చెప్తాను - ఆ తర్వాత జరగబోయ్యేది- అనగానే ఆమె ఉలిక్కిపడిందట ! మళ్లా వస్తాను - అంటూ దౌడు తీసిందట! - ఇందులోని అంతరార్థం అనేక విధాలుగా స్ఫురించి మనను ముసి ముసిగా నవ్వుకునేట్లు చేస్తుంది.

క్రిక్కిరిసి ఉన్న బస్సులో హఠాత్తుగా బ్రేకు పడితే - నిలిచి ఉన్న అమ్మాయి అందాల అలవలె మీద పడిందట ! ఆమె 'సారీ' చెపితే - కవి - 'దెన్ రిపీట్ ఇట్' అంటూ ఆమెను సమాదరించటంలోని చమత్కారం మనల్ని గిలిగింతలు పెడుతుంది.

"నా కవిత్వాలు హేమంతములో పూచిన పుష్ప కోరకాలు"- అని కవి చెప్పుకున్నా,- ఈ చమత్కార ధోరణి, హాస్యరస స్ఫూర్తి- ఈ కవితలను వసంతంలో చిగిర్చిన పుష్పవాటికలనుగానే చేస్తుంది.

మగవాళ్లకు గుండెపోటు ఎక్కువగా ఎందుకు వస్తుందీ? దీనికి సైన్సు చెప్పే సంజాయిషీ ఒక విధంగా ఉంటుంది. కాని, ప్రేమికుని తీర్పు ఇలా ఉంటుంది :

"ప్రేమించేది ప్రేమగాయాలు తినేది
మొగవాళ్ల గుండియలే !
అందు చేతనే గుండెపోటుతో చచ్చేదీ
మొగవాళ్లే !"

ఈ కవికి, ప్రేమించే హృదయంతో పాటు, ప్రగతిశీల దృక్పథం ఉన్నదనటానికి తార్కాణాలు చాలానే కనిపిస్తాయి.

'వైధవ్య చిహ్నాలు లేని
ఆమె ముఖ వైఖరి చూచి
ప్రగతి శీల ఆధునికత
ప్రతిబింబిస్తుందని సంతోషించాను.'

అనటంలో అర్థవిహీనమైన ఆచారాల పట్ల నిరసన కనబడుతుంది.

మానవ జీవితంలో మనస్సు ప్రభావం అన్నిటి కన్నా గొప్పది. జీవితం గురించిన జిజ్ఞాస ఏదో ఒక దశలో మనిషికి అవసరం.

జరను హేమంతంతో పోల్చడం గొప్ప ఆలోచన, జరను సంధ్యతో పోల్చడం మామూలు సంగతి. కాని-

"జరా హేమంతమున
విగత వసంత స్మరణలు
మంచు నేలి ముసుగులతో
సైగలతో పిలుస్తున్నాయి"

అంటూ ఒక మనోహరమైన కల్పనను చేస్తాడు కవి. ఆతమాత్రం చేత వృద్ధాప్యాన్ని తిట్టుకుంటూ కూర్చోడు ఈ కవి -

''చిగురు టాకులకు
చిరుమొగ్గలకే కాదు
ఆమని పండుగలు
పండిన ఆకులు ముదిరిన పువ్వురేకులు
ఆ ఉత్సవానికి భాగస్వాములే''

అంటూ పండిన ఆకులకు పచ్చదనం, ఎండిన గుండెలకు కొత్త రక్తం - జిల్లుమంటూ ఎక్కేట్లు చైతన్య భరితం చేస్తాడు కవి.

కాలం ఎంతటి వారికైనా, ఒకే విధంగా ఉండదు. ఈ సత్యాన్ని కవి ఒక నిరాసక్తతో - సూటిగా చెపుతాడు ఇలా -

''జీవిత ప్రయాణము
ఒక్కొక్కసారి బురద మడుగుల్లో
ఒకొక్కసారి ఇసుక పర్రల్లో సాగుతుంది''—.

మానవత్వపు విలువలను మరచిన జపతపాలు నిరర్థకం అనీ, ప్రేమ రాజ్యంలో కులాల కరగోడలు లేవనీ - కొన్ని విమర్శలు విసురుతారు.

''లేని వలపుకు కలలు మిగిలాయి
లేని ఆమెకు జాడలు మిగిలాయి''

అంటూ కవి — ఈ సంపుటిని గురించి కవితా వ్యాఖ్య చేసుకున్నారు. ఇవి-లేని ఆమె జాడలైనా - వెతుక్కోకుండానే — కొన్ని సాహిత్యపు విలువల జాడలు కనిపిస్తాయి. వాటి దర్శనం రేఖా మాత్రంగా నిరూపించటానికే ఈ చిన్న వివరణ.

# ఆమె నీడలు

'ఆమె'-'ఆమె జాడలు'లో - ఆత్మానందానికీ, రసానుభూతికీ ప్రాధాన్యం ఇచ్చి నడిచిన గోపాలరెడ్డిగారి కవిత్వం - 'ఆమె నీడలు'లో లౌకిక సంబంధమైన అనేక జీవన సత్యాలు ఆధారంగా ప్రోది చేయబడింది. మనం రోజూ చూస్తూ, వింటూ ఉండిన అనేక సంఘటనలు కవితా రూపంలో ఖండికలుగా ముద్ర కట్టి, 'ఆమె నీడలు'గా మన ముందు నిలుస్తాయి. చెణుకులు విసరడం, రాజకీయాలు చెప్పడం, తాత్విక చింతన చేయడం, వేమనవలె సాంఘిక విషయాలను విమర్శించడం, హాస్య చమత్కారయుతమైన రస గుళికల్ని ముక్తకంలో అందించడం - వీటిని కవితా రూపంలో వ్రాసి మెప్పించడం - చాలా కష్టమైన పని. గోపాలరెడ్డి గారు తమ కవితా ఖండికలలో ఈ ప్రయోగాలు చేసి - కవిత్వపు పోకడలు కొత్త పద్ధతిలో ఎందుకు సాగకూడదు అంటూ ప్రశ్నిస్తారు.

"నా కోర్కెలతో జతగూడి
నా సంతోషాలతో రెక్కలు తొడిగి
నా కలలలో ఎగిరే
నా భావాలే నా పద్యకాలలో గూడు కట్టాయి''

అంటూ, తాము ఏమి వ్రాస్తున్నారో, ఎందుకు వ్రాస్తున్నారో సింహావలోకనంగా చెపుతారు. ఎన్నో సామాజిక, రాజకీయ ఉదంతాల, విమర్శలతో పాటు కవి - తనకు ప్రధానంగా ప్రేరణ కలిగించిన ప్రకృతి విలాసాలను, సౌందర్యమయమైన రసానందాన్ని వర్ణించటం మానుకోడు. అందుచేత - ఈ సంపుటి గులాబి సౌకుమార్యం, కరకురాళ్ల గట్టితనం, చిగురుటాకుల పచ్చదనం, ఎండుటాకుల పసుపుదనం - అన్నీ కలగలుపుగా కలిపిన రంగుల రాటంగా భాసిస్తుంది.

ప్రకృతిని చూచి పరవశించడం కవి లక్షణం. కొండ వాగూ,నిశ్చల నీరం, గడ్డి మొలకా, సముద్ర సంగీతం - సామాన్య విషయాలు కొందరికి. భావుకుడైన

కవి ఈ దృశ్యానికి గుండెలు పిండివేసినట్లు అనుభూతి చెందుతాడు. తదను భూతికి అక్షరాకృతిని దిద్ది ఇతరులతో పంచుకోవాలని తపన పడతాడు.

గోపాలరెడ్డిగారు ఈ సంపుటిలో చేసిన కొన్ని ప్రకృతి వర్ణనలను చూస్తే కవి ఊహారేఖ ఎంత లలితంగా కదిలిందో కానవస్తుంది.

"నదీమాత వొడ్డున
నవ్వుల హారాలు పెట్టి వెడలింది
నురుగులు దొంతరులుగ తేలాయి !"

నది ఒడ్డున తేలిన నురుగులు నవ్వుల హారాలుగా కనిపించాయి - అని చెప్పటం సహజమైన వర్ణన. కాని, ఇక్కడ నది వదిలినది నవ్వుల హారాలు మాత్రమే ! ఆ హారాలని నురుగుల దొంతరలుగా తీర్చటం కవి గడుసుదనం.

ఆకాశంలో మబ్బులు పట్టటం ఎరగనిది ఎవరు ? ఆ మబ్బులు నల్లనివి, తెల్లనివి, దూది పింజల వంటివి, కాటుక ముద్దల వంటివి. ఆ మబ్బులు ఆకాశ రాజ్యాన్ని ఏలుతాయి. ప్రణయ రాయబారాలూ నడుపుతాయి. ఆ మబ్బులు ఒక్కొకసారి ఎక్కడకో పారిపోతాయి. అప్పుడు ఆకాశం ఎలా ఉంటుంది? వాతావరణ పరిశీలకుడు - ''ఆకాశం నిర్మలంగా ఉంది'' - అంటాడు. కాని, కవికి - ఆ నిర్మలాకాశాన్ని చూస్తే ఏమనిపించిందో చూడండి !

"కొన్ని వేళల ఆకాశము
తన దిసమొలకు సిగ్గుపడుతుంది !''

ప్రకృతి కేవలం సౌందర్య స్ఫూర్తిని ఇవ్వడమే కాదు-కవిని ఆశావాదిని కూడ చేస్తుంది. ఆ ఆశావాదం ప్రకృతిపరంగా నిరూపించి - గోపాలరెడ్డి గారు నిస్పృహను తొలగించే ప్రయత్నం చేస్తారు.

"తుపానులో కొమ్మలు కూలినా
వేళ్లు పదిలంగానే ఉంటాయి
చెట్టు వెలది పచ్చచీర మరల ధరించింది.
పువ్వులతో మరల నవ్వింది''

దెబ్బతిని పడిపోవడం ఎంత సహజమో - తిరిగి లేవడం - కొత్తజీవనం సాగించడం - అంత న్యాయమైన ధర్మమే !

"ఆశా బీజము ననలెత్తడానికి
పుడమి నిరంతర యత్నము చేస్తూనే ఉన్నది''

అంటూ వెన్ను తట్టి చెప్పడం కూడా కవి ధర్మమే !

''నక్షత్రాలు ఏడాదికి ఒకమారే
కాన్పించితే ఎంత బాగుండేది !"

నాగరికుల చేత ఉపేక్షింపబడే నక్షత్రాలను చూస్తే కవికి బాధ ! ఈ అగౌరవాన్ని పొందే బదులు ప్రకృతి మనిషికి దూరంగా ఉంటేనే బాగుండేది - అని నిర్వేదంతో తలపోస్తాడు.

ఒక దృశ్యాన్నో, అనుభూతినో - ప్రతీకాత్మకంగా చెప్పి మెప్పించగల ప్రతిభ గోపాలరెడ్డిగారికి ఉంది.

''సంజె చీకట్లలో
ఆమె ముంజేయి
నా చేతిలో వ్రాలింది
రెక్కలు ముడిచి పక్షి గూడు చేరింది
సంజెవేళ పక్షి గూడు చేరింది''

సంజెవేళ పక్షి గూడు చేరటం విశ్రాంతి కోసం, భద్రత కోసం. చేతిలో చేయి వేసి-ఆమె నిశ్చింతగా నిలిచిపోయింది ! చేతిలో చేయి వ్రాలటం - పక్షి గూటిలో వ్రాలటమంత అందంగా జరిగింది ! కవి ఊహా విహంగము ఎగిరి ఎగిరి ఈ కవితా రూపంలో సాహిత్య సీమలో వ్రాలింది !

ఆమె భరతనాట్యం చేసింది. కవికి - ఆ నర్తన - "కాసార పక్ష వేదికపైై నర్తిల్లె చిరుకెరటము'' వలె సౌందర్య వీచికగా భాసించింది. చిరు కెరటపు కదలికతో నాట్యమయూరి విన్యాసాన్ని పోల్చుకోవడం-సుకుమార భావనను సురుచిరంగా చెప్పుకోవడం!

పువ్వులు పరిమళాన్ని వెదజల్లటాన్ని కవులు ఇంతకుముందు ఎన్నో కల్పనలతో చెప్పారు. కాని, పువ్వును ధనువుతోనూ, పరిమళాన్ని శరపరం పరలతోనూ పోల్చడం - కవి చెప్పే కొత్త భావన.

చేతి ముడుపూ, చేతి విడుపూ-ఎంత సుందరంగా వర్ణింపబడిందో చూడండి !

''ఆమె ముడిచిన కరతలము తామరమొగ్గ
వేళ్ళు విప్పగనే పూచిన పద్మము''

నృత్య సంప్రదాయంలో ఒకటి ముకుళ హస్తము. మరొకటి పద్మ కోశము.

నిద్రలో అనేక స్వప్నాలు. వాటిని మాటలలో బంధించటం ఎలా ? మాట లకే అందనివి కవిత్వంలో బంధింపబడతాయా ! ఆ స్వప్న సౌరభాలు ఊహకు కాని, కలానికి కాని అందవలేదని తపనతో-ఇలా చెప్పుకొంటాడు:

''నిద్రా పారిజాతము
రాత్రంతా స్వప్న పుష్పాలను రాల్చింది
నా కవితా సుందరి వానిని ఏరబోయింది
వెలుగు గాలులకు ఎగిరి పొయ్యాయి''

ఉషోదయ రేఖలు ఇక్కడ గాలులై - స్వప్న పారిజాతాలను దూరంగా విసిరి కొట్టాయి !

''వనమంతా
పలాశ అరుణ రాగాలే
హృదయమంతా
ప్రణయానల కీలలే !''

పలాశ పుష్పం అడవిలో జ్వలించే అగ్నికీల - మనస్సును మండించే ప్రణయ కీలకూ-పలాశ అరుణ రాగానికీ ముడి పెట్టడం - ఎంత రాగ రంజిత మైన ఊహ !

చందనం అలుదుతూ, చక్కిలిగింత పెట్టినట్లు కవ్విస్తుంది ఒకొకప్పుడు గోపాలరెడ్డిగారి కవిత. అందులోనూ ఒక సున్నితమైన విమర్శ-హాస్యపు ముసుగు వెనుక నుంచి తొంగి చూస్తుంది. మచ్చుకు-

వీపు కనపడే జాకెట్టు తొడగటం - ఆధునిక యువతికి నాగరికత. ఆమె సభలో కూర్చున్నది. ఆమె వెనక కూర్చున్న వారికి ఆమె వీపు గొడవ తప్ప సభ గొడవ పట్టలేదు! ఈ ముక్త కవితలో కవి హాస్యంగా, కొంటెగా - ఈ విషయం చెప్పటమూ ఉంది. సాహిత్యపు సభలకూ - పదిమందిలో మర్యాదగా మసలవలసిన చోట్లకూ-ఇతరుల దృష్టిని అతిగా ఆకర్షించే విధంగా వేషధారణ చేసి వచ్చే వారిపైన ఒక కొరడా దెబ్బ విసరటమూ ఉంది!

అధికార యంత్ర చక్రంలో ఒకరుగా ఉండే అనుభవమూ - ఆ పరిభ్రమణంలో నలిగిపోయే అనుభవమూ-రెండూ ఎరిగినవారు కనుకనే - ఆ విషయాన్ని ధైర్యంగా చెప్పగలిగారు కవి - ఒక ముక్తకంలో.

పదవీ కాంక్ష ఎంత మోసకారి! పదవుల తీపినీ చేదునూ ఎరిగిన గోపాల రెడ్డిగారి దృష్టిలో-అది ఇంతటి మోసకారి!

"ఎరను చూచి చేప మోసపోతుంది
మేకను చూచి పులి మోసపోతుంది
పదవుల చూచి మానవుడు మోసపోతాడు!"

ఉన్నతమైన రాజకీయ సంస్కారం పండించుకొన్న గోపాలరెడ్డిగారు చిత్తశుద్ధితో చెప్పిన మాటలు - ప్రస్తుత రాజకీయ వాతావరణంలో మళ్ళీ మళ్ళీ మననం చేసుకోవలసిన మాటలు. ఈ కవిత చూడండి!

"ప్రజల భయ భక్తుల
కోరుతాడు నియంత
ప్రేమాదరణల
కోరుతాడు నాయకుడు."

కవి ఆలోచనా స్రవంతి ఒక్కొక్కసారి సుళ్ళు తిరుగుతుంది. తన చుట్టూ ఉండే నిస్సహాయతను, అన్యాయాన్ని, బాధల్ని, తలుచుకుని ఆర్తిపడే గొప్ప లక్షణం ఉంది.

దూర దిగంతాల పొలాల గట్టున కూలీలు ఇండ్లకు పోతుంటే-నర పిపీలికల బారులే పోతుండినట్లు ఉందనటం అద్భుతమైన భావన కాదా!

జీవితంలో కొన్నాళ్లు మాత్రమే కృష్ణపక్షమైనా, శుక్లపక్షమైనా. కాని ఆ కృష్ణ పక్షపు నిర్వేదం శాశ్వతం అనుకునే వారికి హెచ్చరింపుగా–

"హేమంత శిశిరాలు
జరిగితేనే వసంతం వచ్చేది
పాత ఆకులు రాలితేనే
చిగుళ్ళు పుట్టేది''

అంటూ - ఆగమన వసంతం కోసం సమాశ్వాసనం తెలుపుతాడు కవి.

డబ్బు లేనిది జీవితం లేదు. ఒకప్పుడు డబ్బు అమృతం మనిషికి-డబ్బు హాలాహలం మరొకప్పుడు.

''చుట్టలు చుట్టిన పాము ధనము
అనేక విష వలయాలను సృష్టిస్తుంది''

డబ్బును చుట్టలు చుట్టిన పాముతో పోల్చడం-అందులో నిక్షిప్తమైన విష గుణాన్ని చెప్పకనే చెప్పడం తన ఊహకు దీటైన పదాన్ని అతికినట్లు వేసుకోవడం ఇందులోని శిల్పం.

కలకలలాడే ఊరూ - ఆ ఊరికి అనుకునే శ్మశానమూ - ఈ బొమ్మ అందరూ నిత్యమూ చూచేదే! అయితే - ఈ బొమ్మ చేత ఒక నిష్ఠురమైన సత్యాన్ని నవ్వుతూ మనకు చెప్పిస్తాడు కవి. నిరుపేదగ ఉన్న శ్మశానాన్ని చూచి నగరం నవ్విందట!

''ఒక నాడు నగరవాసులందరు
నా శరణం పొందుతారులే
అని శ్మశానం నవ్వింది!''

ఇంతటి తత్వజ్ఞానాన్ని - మూడు ముక్కల్లో - మూడేళ్ళ పసివాడికి కూడా అర్థమయ్యేట్లు చెప్పగలగటం - ఆధునిక కవితా లక్షణాన్ని అంది పుచ్చుకున్న ఈ కవికి సులభ సాధ్యమే అయింది !

"కవిత్వాన్ని కొత్త పోకడలతో నడిపించాలి. పాత ధోరణిని కొంత మార్చాలి. విహంగంలా, గరుడ పక్షిలా, కవితా సౌరభాన్ని దిక్కులకు వెద జల్లాలి"- అంటూ సాహిత్యపు సభలలోను, గోష్ఠులలోను - ఉద్బోధిస్తుంటారు గోపాలరెడ్డి గారు. ఈ కొత్త పోకడను తమ కవిత్వంలోనే తీసుకువచ్చి ప్రయోగం చేశారనిపిస్తుంది - వారి కొన్ని కవితలను చూస్తుంటే ! అవి గోపాల రెడ్డిగారి జ్ఞాపకాల దొంతరలలో నుంచి రాలిపడిన మౌక్తిక ముక్తకాలు.

సి. ఆర్ రెడ్డి, సరోజిని నాయుడు-సభల్లో - ఇష్టాగోష్ఠులలో వ్యంగ్య విమర్శతో - హాస్య స్ఫూర్తితో అన్న మాటలు - మరికొన్ని రాజకీయాలను గురించిన చతురోక్తులు - ఈ కవితలలో చోటు చేసుకున్నవి. వీటిని ఎవరికి వారు చదివి ఆనందించి నవ్వుకోవలసినవే! వీటిలో సాహిత్యపు గుబాళింపు లేకున్నా, భావ ప్రాధాన్యం కలిగి చదువరులకు చమత్కార సిద్ధి కలిగిస్తాయి. వీటిని ముందు తరం ప్రజ సాహిత్యపు మన్నన కోసం కాకున్నా, చారిత్రిక కథ నాలుగా భద్రపరచు కొంటారు. హాస్యరసం రంగరించిన రచనలుగా వీటికి ఒక ప్రత్యేక స్థానం ఉంటుంది.

"నక్షత్రాల సొంపులు
ఆకాశమంతా లేవు
కవితా చమత్కారాలు
కావ్యమంతా లేవు
ఉంటే వెగటవుతుంది"

అని చెప్పిన గోపాలరెడ్డిగారు ఆ వెగటును మాన్పడానికి ఈ క్రొత్త కవితా ప్రయోగాలు చేశారు కాబోలు అనిపిస్తుంది. కవితా చమత్కారాలతో పాటు వాస్తవ ఘటనా చిత్రాలు కళ్ల ముందు కట్టించారు కవి 'ఆమె నీడలు'లో. స్వతంత్రమైన ఆలోచనలూ, కవితా రీతులూ జోడించి వెలుగు నీడల్ని అక్షర తోరణంగా కట్టి ఈ ముక్తక ప్రసూన మంజరిని రసజ్ఞ లోకానికి అందించారు గోపాలరెడ్డిగారు.

# "ఆమె తళుకులు"

చంద్రవంకను ఉయ్యాలగా చేసుకుని, నక్షత్రాల మధ్య ఊగుతూ - హేలగా తళుక్కుమంటూ మెరిసే 'ఆమె' - 'ఆమె తళుకుల'కు ప్రతీకగా, అట్టమీది బొమ్మగా కనిపిస్తుంది. ఇందులోని కొన్ని గద్య పద్యకాలు - ఇంతకు ముందు వచ్చిన కవితా సంపుటులలోవలెనే ప్రకృతినీ, స్త్రీనీ, ప్రేమనూ, ఆత్మానుభూతినీ ఆలంబనంగా చేసుకున్నవి. కాని, చాలావరకు గోపాలరెడ్డిగారు తమ చుట్టూ ఉన్న లోకాన్నీ, మనుష్య ప్రవర్తననూ, రాజకీయ కాలుష్యాన్నీ చూచి చేసిన వ్యంగ్య వ్యాఖ్యలు. కవి యొక్క వ్యక్తిగత అనుభూతులూ, సమిష్టి జీవిత స్వారస్యమూ, రాజకీయ చైతన్యమూ కలిసి ఈ ఖండికలుగా వెలిశాయి. దేశ కాల పరిస్థితులకు స్పందించి విప్లవాత్మకమైన విసుర్లతో కవిత్వం నడిపి-తాను ఎప్పుడూ గగన విహారినే కాదు-అనే విషయం నిరూపిస్తారు.

ఈ విషయాన్నే ప్రస్తావిస్తూ - "మతము, సంఘము, సాహిత్యములపై నా అభిప్రాయాలు కొంత భిన్నముగనే తోస్తున్నవి. విప్లవ కరములైనవి, వితండములైనవి కాకపోవచ్చు. కాని, నలిగిన త్రోవనే వెడలుట లేదని గ్రహించాను" అంటారు తమ 'నివేదన' లో.

అవును - కొన్ని కవితలు నలిగి, నమిలిన త్రోవనే నడువవు! కవి-ఏదో గోష్ఠిలో సమాలోచనం చేస్తున్నట్లు. తన ఆలోచనలను పైకి చెప్పుకుంటున్నట్లు, ఎదురుగా కూర్చుని కబుర్లు చెపుతున్నట్లు నడుస్తాయి ఈ ముక్తకాలు. భావ కవిత్వానికీ అభ్యుదయ కవిత్వానికీ సేతువు కట్టి, దానిపైన విశ్వాత్మకమైన కళలను వివిధ రూపాలలో నడిపించినట్లు ఉంటుంది - ఈ కవితా సంకలనాన్ని చదవటం ముగించినాక.

కవిత్వం అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం చెయ్యాలనిఅంటూ-

"విస్తరించాలి చైతన్య పరిధి
అగ్ని జల్లినా అమృతం కురిసినా
అందం-ఆనందం దాని పరమావధి"

అంటూ తిలక్ చెప్పిన నిర్వచనం - గోపాలరెడ్డిగారి కవిత్వపు పోకడలను ఒక వరుసలో పరిశీలిస్తున్నప్పుడు జ్ఞాపకానికి వస్తుంది.

చెప్పదలచిన విషయం కొంచెం విస్తృతమైనదైనప్పుడు-కవి- ఈ హ్రస్వ కవితలని తొమ్మిది, పది వరుసల వరకూ పెంచారు.

"ఆమె స్మరణ స్వర మాలికలే
నా మూగ మురళిని పలికించాయి."

అంటూ 'ఆమె'లో కవి చెప్పుకొన్న సత్యం - వారి కవితలలో పెక్కు చోట్ల భాసిస్తుంది. ప్రేమను గురించి, ప్రేయసిని గురించిన కవి ఊహలు ఈ సంపుటిలో కొన్ని ముక్తకాలలో నిబద్ధం చేయబడ్డాయి.

కీట్సు, షెల్లీ, బైరన్ వంటి ఆంగ్ల కవుల భావనలచేత ప్రభావితులై తెలుగు భావకవులు ఒక లోకాతీతమైన సౌందర్య మూర్తిని సృష్టించుకుని కవిత్వం అల్లుకుంటే, గోపాలరెడ్డిగారు 'ఆమెను' సూఫీ ప్రణయ పరంగా సృష్టించుకున్నారు. ఆ పోకడలోనివే 'ఆమె తళుకుల' లోని కొన్ని కవితలు.

"ఆమె ప్రేమ జాలములో చిక్కి
గాలపు ఎరను మింగిన చేపవలె
కొట్టుకుంటున్నాను"

అనడం - ప్రేమ ప్రాణసంకటాన్ని కలిగిస్తుందని చెప్పకనే చెప్పడం.

ఇక్కడ - ప్రేమికుడు అమాయకుడు. ప్రేమించటం తప్ప అతనికి ఏమీ తెలియదు. కాని ఆమె మాత్రం - హృదయం ఉందా లేదా అనేట్లు ప్రవర్తిస్తుంది. నది ఒడ్డున కూర్చుని ఛాయలు చూసుకొంటున్న అతడిని ఆమె వెనుకగా వచ్చి నదిలోకి త్రోసివేసింది.

"దాని సుడిగుండాలలో తిరుగుచు
గుటకలు వేస్తున్నాను"
అనేది మనస్సును ద్రవింప చేసే భావన.

ప్రేమ వలలో తగుల్కొని, పద్మవ్యూహపు అభిమన్యుని వలె చితికి పోతాడట ఆ ప్రేమికుడు

ప్రేమను గురించీ ప్రేయసిని గురించీ కవికి కల భావుకతా ధోరణి- అమలిన శృంగార తత్వానికి సంబంధించినది. ఆ విషయాన్ని ఇలా చెపుతారు-

"ప్రేయసి కల్పనా ప్రపంచపు
ఆకర్షణగానే ఉండాలె
చేతికి అందక
హృదయానికి మాత్రమే
అందుతు ఉండాలె".

ఆమె చూపుల్ని వెన్నెల బంతులుగా, పూల గుత్తులుగా, నిప్పు కణాలుగా ఉపమించడం - ఆమె మనఃప్రవృత్తిని చెప్పకనే చెప్పడం.

నిపుణుడైన వైణికుడు - వేరు వేరు శ్రుతులలో రాగం పలికించ గలిగిన నిపుణుడై ఉంటాడు. అదే విధంగా - ప్రకృతి పరిశీలకులైన గోపాలరెడ్డిగారు- ఈ సమస్త సృష్టి సౌందర్యాన్ని తమ కవితా నేత్రంతో చూచి, అనుభవించి అక్షరబద్ధం చేస్తారు.

కదలి అల నవ్వుతూ, ఎగురుతూ రావడం చూచిన కవి ఆ అల తిరోగమనాన్ని చూచి - ఆ చిరుకెరటపు చిందు

'ఒడ్డుకు తల మోదుకుని
దీనంగా వెడలి పోతుంది' — అని భావిస్తారు ఆర్ద్రంగా !

సౌందర్య స్వరూపమైన ప్రకృతితో పాటు-రసావిష్టమైన జీవన స్రవంతిని ముడిపెట్టి కవనం చెప్పటం కవికి ఇష్టం.

కన్న నదులను కొండలు సముద్రానికి పంపినట్లు - పెంచిన అమ్మలు కూతుళ్లను అత్తల యిళ్లకు పంపుతారట ! ప్రకృతికీ, మనిషి జీవితానికీ లంకెల లింకులు కట్టి - ఈ సమాన ధర్మాన్ని చెపుతాడు కవి.

సృష్టినీ, సమాజాన్నీ ప్రేమించటం తెలిసిన కవికి - అందులోని లోటు పాట్లు కూడా తెలిసి ఉండటం సహజం. సమాజ పరమైన అనేక విషయాలను గురించి తమ మనస్సు కదిలినప్పుడల్లా, ముక్తపద బంధాల రూపంలో కాయితం మీద పెట్టారు గోపాలరెడ్డిగారు. వీటిలో కవిత్వపు బంధాల కన్నా, అనుబంధపు గుబాళింపులు ఎక్కువగా కనిపిస్తాయి పదార్థ వివేచన చేయవలసినవి ఈ కవితలు.

అఖిల భాషా సమ్మేళనం కావాలని కోరటం - కవికి కల అఖిల భారతీయ దృక్పథాన్ని చాటుతుంది.

"అన్నీ భాషాదళాలు
వికసిస్తేనే
భారతీయ కమలము
నవ సౌరభాలతో గుబాళించేది"

సాహిత్యం ఎప్పుడూ కొత్త పోకడలలో నడవాలనీ, తరతరానికీ భాష మారటం సహజమనీ, ప్రాంతీయమైన యాస పలుకుబళ్లు, భాషా వనంలో పూచిన వివిధ వర్ణాల పుష్పాల వంటివనీ సాహిత్య విషయంలో తమకు గల ఆధునిక దృష్టిని వివరిస్తారు. ఈ అభిప్రాయాలు గోపాలరెడ్డిగారు అనేక సార్లు సాహిత్యపు వేదికల నుండి వెలువరించినవి. అభ్యుదయ వాదులందరకూ ఈ మాటలు నచ్చుతాయి.

కవికి గల ఈ అభ్యుదయ వాదం సాంఘిక దురాచారాల పట్ల, మూఢాచారాల పట్ల నిరసన తెలపటంతో వ్యక్తమవుతుంది

"ప్రాచీన సభ్యతా కల్ప వృక్షము
అస్పృశ్యత కులభేదాల
విష ఫలాలను ఇచ్చింది !"

ఇదే విషయాన్ని ఇంకా తరిచి—

'శాస్త్రాల కల్పతరువుకు
ఆచారాల నీరాలతో పెంచుతున్నారు

ఫలాల నిచ్చిందని సంతసించాము
తినరాని చేదుతో నిండి ఉన్నాయి'

అంటూ తీర్పును చెపుతారు !

స్త్రీ-శృంఖలాబద్ధ కావడం ఎవరికి నచ్చుతుంది ? ''న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి'' - అన్న మనువుపైన గోపాలరెడ్డిగారికి కంఠం దాకా కోపం. ఈనాడు ఈ మాత్రమైనా స్త్రీకి స్వాతంత్ర్యం వచ్చిందని సంతోషం. స్త్రీలకు అపచారం చేసి పోయిన మనువు లెంపలు వేసుకునేటట్లు కొన్ని కవితల్లో తీవ్రంగా విమర్శి స్తారు కవి.

పదవుల కోసం పోటీలు, స్పర్థలు, ద్వేషాలు, మోసాలు-ఈనాటి మానవ మస్తిష్కాన్ని తొలిచే విషపు పురుగులు.

''పదవుల గులాబీలను ముద్దిడబోయాను
పెదవులకు నెత్తురు వచ్చింది ముళ్లు గుచ్చుకుని
గులాబీలు ప్రొద్దుటికే వాడిపోయాయి
పెదవుల నొప్పిమాత్రం మిగిలి ఉండింది.

పదవుల అస్థిరత్వాన్నీ, పదవీకాంక్ష తెచ్చిపెట్టే అనర్థాన్నీ ఇంతకన్నా కవితాత్మకంగా చెప్పడం కష్టం.

పదవులు సంపాదించడం ఈ రోజుల్లో కష్టం ! కొత్త చెప్పులు కరుస్తుం టాయి నడిచేటప్పుడు. వాటిని వేయాలేము, తీయాలేము, గొప్ప ధరతో కొన్నామే! పదవులూ అంతే! - అంటూ వ్యాఖ్యచేస్తారు - ఈనాటి నాయకుల పదవీ వ్యామో హాన్ని దృష్టిలో పెట్టుకుని !

దేశ స్వాతంత్ర్యం కోసం త్యాగాలుచేసి ఉన్నత ఆదర్శాలను జీవితమంతా సురభిళ సౌరభంగా నింపుకున్న గోపాలరెడ్డిగారికి - ఈ నాటి పార్టీ ముఠా తత్వాలంటే ఎంత ఏవగింపు ! చూడండి.

"పార్టీలు మార్చే రాజకీయ వాదులతో
పోలుస్తారు ఊసరవెల్లిని
ఊసరవెల్లికి ఎంత మనఃక్లేశము కలిగిందో
నీచోపమలు వింటుంటే !''

కవి హృదయం పొగడ పువ్వును చూచినా, శిలాసుప్త శిల్పాన్ని చూచినా కరిగిపోతుంది.

''శిలాసుప్త శిల్పం రామప్ప దేవాలయం
శతాబ్దాల మైమరపించే
సౌందర్యోన్మత్తత ఆవేశించింది.''

అన్నిటిలోకీ కళాదాహం గొప్పది! గొప్ప కళనుంచి ఎవరి హృదయ సంస్కారాన్నిబట్టి వారు రసావిష్కరణ చేసుకోగలుగుతారు. తమ మనస్సులో సుళ్ళుతిరిగే అనేక భావాలను కళాదృష్టితో చూచి, ఇలా- చిన్నచిన్న పద్యకాలలో ఇమిడ్చి చెపుతారు కవి. భాషను జటిలంగా కాక పదిలంగా వాడుకుని-అనుభూతి ఆర్ద్రతలో తడిపి, కబుర్లు చెపుతూ కవిత్వం చదివిస్తారు గోపాలరెడ్డిగారు—'ఆమె తళుకుల'లో.

## "ఆమె చెణుకులు"

''సాహిత్యానికి కూడ
హేమంత శిశిరాలు కావాలె
కాని ఆమె చెణుకులూ వచ్చాయి !''

అంటారు కవి. శిశిరంలో కూడ వసంతాన్ని దర్శించగలిగే కవికి ధారగా వచ్చే సాహిత్యప్రవాహాన్ని ఆపడం తరమా।

నీవు గరుత్మంతుడవు
ఎగురుటయే నీ కర్తవ్యము
నీ సమ్ముఖమున
మిన్నులు ఇంకా ఎన్నో ఉన్నవి.

అన్నది-గోపాలరెడ్డిగారు తెలుగు చేసిన ఇక్బాల్ కవిత్వం. ఈ లక్ష్యాన్ని నిర్దేశించుకొని వారు క్రొత్తకవిత్వాలు చెపుతూ, సాహిత్య విహారం చేస్తున్నారని చెప్పడానికి ఈ 'చెణుకులు' నిదర్శనం. ఆత్మలోనుండి అనుభూతిని అందుకుని దానికి రుచీ, రంగూ, పోహళింపూ రంగరించి, ముక్తకవితారూపంలో మనకు అందిస్తారు కవి 'ఆమె చెణుకు'లలో.

నాలుగు 'ఆమె'ల ముక్తసంకలనాలతోపాటు - దీర్ఘ కవితా సంపుటులు కూడా ఈసరికి వెలువరస్తూ వచ్చారు గోపాలరెడ్డిగారు. అయిదు సంవత్సరాల అవిరామకృషితో-వారికి తమదైన ఒక స్వంతబాణీ-స్వంతవాణీ ఏర్పడ్డది. వారి కవితలు వారపత్రికలలోను రేడియోలోను తెలుగువారికి పరిచయమయ్యాయి.

కవిత్వం ఎలా చెప్పినా, తనదైన స్వంతశైలిని స్థాపించుకోగలిగినప్పుడు సాహిత్యంలో చిరస్థాయి ఏర్పడుతుంది. వారి కవితలు పేరు చెప్పకుండా చదివి వినిపిస్తే-ఇది గోపాలరెడ్డిగారి కవిత్వం అని సాహితీ ప్రియులు చెప్పుకోగలిగిన స్థాయికి వారు ఎదిగారు.

ఒక విషయాన్ని అంటిపెట్టుకుని-అదే మూసలో వ్రాసిన కవితలు కావు ఇవన్నీ. ఏ రైలులోనో ప్రయాణిస్తున్నప్పుడో - అర్ధరాత్రి అర్ధజాగ్రదావస్థలో ఉన్నప్పుడో-ఒక సంగీతాన్ని-నృత్యాన్ని, సాహిత్యాన్ని, సుందర దృశ్యాన్ని దర్శించినప్పుడో - వారి మనస్సులో పూచిన అనుభూతులను-అప్పుడప్పుడూ రచించి మాలకట్టిన సుమదామాలు ఈ కవితా సంపుటులు. కొన్ని కవితలు రక్తినీ, అనురక్తినీ కలిగిస్తే - మరికొన్ని వాస్తవ జీవితగాథల్ని తవ్వితీసినట్లుంటాయి. అందుచేత ఏ పద్యానికి ఆ పద్యకం విడతీసి చదువుకుని - అందులోని స్వారస్యాన్ని గ్రహించవలసిన అవసరం ఉంది.

'ఆమె చెణుకు'లలో ఎక్కువగా ప్రకృతి పరిశీలన ఉంది. కొంత సాహిత్య సమాలోచనం ఉంది. మతం, మానవత్వం, దుఃఖం, మరణం, పదవీకాంక్ష, ప్రణయం-వీటన్నిటిని గురించిన వ్యాఖ్య ఉంది. మిణుగురు నుంచి జ్యోతిర్మండలం వరకు, ఊసరవెల్లి నుంచి ఇంద్రధనుస్సు వరకు కవి దృష్టి ప్రసరిస్తుంది.

గోపాలరెడ్డి గారికి సాహితీ ప్రియం భావుకత్వం ఉన్నది. అందుకే రస కవితాత్మకమైన వాక్యం—

"సాహిత్యపు చింతన లేకుంటే
ముదిమి వగలు మేల్కొంటాయి."

'రస సింధువులో నిత్య సంచారి - సాహిత్య ప్రయాణంలో కర్ణధారి'— అయిన సాహితీ మిత్రుని గురించి సమార్ద్రంగా సమాలోచన చేస్తూ——

అతనికి యియ్యగలిగినదేమి
అర్ణవ విలోల తరంగాలకు
కవితా వీచికను శ్రుతి కలపుట కన్న- అంటారు.

జీవితంలో ఎదురయ్యే దుఃఖాలను మరవటానికి సాహిత్యపు సాంగత్యంతో పాటు— విశ్వాత్మకమైన ప్రేమను ఉపాసిస్తాడు గోపాలరెడ్డి గారిలోని తాత్వికుడైన కవి.

జీవిత గ్లానులను మరచుటకు
ప్రేమ స్మరణ మురళిని వాయిస్తాను.

అంటూ చెప్పగలగడం కవి ఆత్మ సంయమనానికి నిదర్శనం.

ప్రేమ అనంత రూపాల్లో గోచరిస్తుంది—భావుకునికి. ప్రకృతితో పాటు స్త్రీని, జీవితంతో పాటు మరణాన్ని, ఆనందంతో పాటు విషాదాన్ని — ప్రేమించగలిగిన ఔన్నత్యం ఉన్నప్పుడు ఇటువంటి కవిత్వం ఉద్భవిస్తుంది—

'దుఃఖరసాల అనుదినము
గిన్నెలతో పానము చేస్తున్నాను'

అనగలిగిన కవి గరళకంఠుడు. అతడి దృష్టిలో మరణం శాశ్వతమైన గగనం వంటిది. జీవితం తృటిలో మాయమయ్యే శంపాలత, హరివిల్లు. 'మరణ స్నాన పునీతులైన జీవులు కర్పూర హారతిలా కరిగి పోతారా? ధూమ్రము వలె తిరుగుతుంటారా?' — ఇవి కవితా రూపకమైన కవి ఆలోచనలు. చదువరిని కొంత ఆలోచింప చేసే ఊహలు.

'పగ్గాలు లేని గుర్రం జీవితము
ఎందుకు ఎప్పుడు ఆగుతుందో
తెలియదు స్వారి చేసే రైతుకు'

అనే తాత్త్వికత ఒక్కొకసారి కవి కలాన్ని నిదానంగా నడిపించినా - ఒక్క కుదుపుతో తిరిగి చైతన్య స్ఫూర్తిని పొందుతాడు, విధికి తలవంచని వీరత్వాన్ని అక్షర రూపంలో ప్రబోధిస్తాడు -

మానవుడా ! విధి ఆఘాతములచే
నీ శిరము రక్తమయము
కాని, నీ మస్తకాన్ని ఎన్నడూ వంచలేదు
నీ పంతాన్ని ఎన్నడూ దించలేదు!

మానవ ప్రవృత్తి రాగ విరాగ సమ్మిశ్రితమైనది. కొంతసేపు రక్తి - మరికొంతసేపు విరక్తి - జీవితం పట్ల ఆసక్తి - మరికొన్ని వేళల నిరాసక్తి - ఈ సహజ ప్రవృత్తిని గోపాలరెడ్డి గారి కవిత్వంలో అనేకచోట్ల దర్శించవచ్చు మనం.

పువ్వుల్ని ప్రేమించడం ఎంత రసమయ ప్రకృతి! ఎంత సౌజన్య ప్రకృతి! గోపాలరెడ్డి గారు కవిగా ఉన్నతించడానికి ముఖ్య కారణం - వారికి ప్రకృతి పట్ల గల అపారమైన అనురాగమే! చెట్ల క్రింద పూల పొదల మాటున కూర్చుని కవితాత్మను అవగతం చేసుకోగలిగిన కవికి - ప్రకృతి రచించిన భావ గీతికలు పుష్పాలు ! అవి భిన్న భిన్న ఛందస్సులలో రచించిన పద్యాలుగా కనపడటంలో ఆశ్చర్యం లేదు !

ప్రకృతిలో కనిపించే అనంత విలాస వైవిధ్యం కవిని దిగ్భ్రాంతుణ్ణి చేస్తుంది—

మేఘ తూణీరము నుండి
ఆకాశము ఎన్ని అంబుల రువ్వుతుంది
తుంపరలు వానబొట్లు మంచు తుంపరలు !

సృష్టికర్త ఒక అపురూప సౌందర్య దీప్తితో సృష్టించిన ప్రకృతికి కవి ఇచ్చే నివాళి, ఇది !

మబ్బు ఏనుగుల కాపరి అప్పుడప్పుడు మెరుపు కొరడాను ఝళిపించడం- విరహిణి నిశీథిని కార్చిన కన్నీటి బొట్లు మిణుగురు పురుగుల వెలుగులుగా మారటం, తారా శిశువులను బుజ్జగిస్తూ తాగుతున్న రాత్రి మంచు దుప్పటిని విదిలించి ఆవలిస్తూ లేవటం - ఈ వర్ణన ప్రకృతి విన్యాసానికి కళాత్మక విలువలు ఇవ్వటం !

“ఆకాశపు నీలత్వంలోనుంచి, నీళ్ల చల్లదనంలోనుంచి, గడ్డి మెత్తదనంలోనుంచి, పువ్వుల మెరుగుతోనుంచి - స్త్రీ సౌందర్యాన్ని దర్శించాలి” - అంటాడు చలం.

ఆమె లీలలు నిత్య నవీనాలే
సదా ఆకర్షణ అయస్కాంతాలే !

అనటం మామూలు వర్ణన. అయితే - ఆ వెంటనే ఒక మెరుపు తునకను విసిరినట్లు ఈ మాటలు——

ఆమె వీక్షణాలతో స్పర్శమణులున్నాయి.
చూచినదంతా పసిడి వన్నెలతో వికసించేదే !

ఆమె పసిడి - ఆమె వీక్షణం పసిడి. ఆమె చూపు తాకిన చోట్ల పసిడి తనం అబ్బుతుంది. ఆ లక్షణం స్పర్శమణి లక్షణం !

ఈ పసిడి వీక్షణం కూడా - ‘అనురాగంతో సంధిస్తే - ప్రణయాగ్ని పుడుతుం’దట !

ఆ ప్రణయాగ్నిని ఆమె ఒక్కొకసారి మౌన హాస సుధలతో అమృతంగా మారుస్తుంది. ఆ మాధుర్య భరితమైన బరువును భరించలేని కవికి అంతులేని ఆత్మ శోధన !

ఆమె మౌన హాస ధారల సుధను
నా మీదనే ఎందుకు చల్లింది ?
ఇలలో నన్నే ఎందుకు ఎన్నుకున్నది ?

కవి కాని, ప్రేమికుడు కాని - భావాల సుడి గుండాలలో సురిగి పోవటం ఎందుకు ? ప్రకృతి ఎందుకు సందడిస్తుంది ? - అన్నది జవాబు.

గగనము మేఘాలలో, సాగరము తరంగాలతో, కవి భావాలతో, ప్రేమికుడు స్వప్నాలతో ఊగుతారనడం-ప్రకృతి గుణాలను ప్రకృతిలోనుంచి పుట్టుకు వచ్చిన మనిషికి అంటకట్టడం! ఇది కవి చమత్కారం.

తమ చైతన్య పూరితమైన జీవితాన్ని పరామర్శించుకుంటూ -

''జీవన చక్రాలు
ప్రయాణాల చక్రాల ఇరుసు మీదే
తిరుగుచున్నవి సాగుచున్నవి'' —అంటారు.

ఈ ప్రయాణాలు ఎక్కువగా సాహిత్య ప్రయాణాలే! ఆ ప్రయాణాలు చేస్తూ-ఎన్నో ఆలోచనలను కవితలుగా మార్చి ఉంటారు. రైలుపెట్టెకిటికీ నుంచి ఆకాశంలో ఎగిరే పక్షుల్ని చూస్తూ ఉంటే, వారికి తమ ప్రయాణం - ప్రాచీనత నుంచి ప్రగతివైపు చేస్తున్నట్లు తోచింది. ఇలా అంటారు కొత్త ఊపిరితో-

శుక శారికలు
గగన మూలముల వదిలి
కొత్త మాటల పాటల నేర్చాయి
కొత్తదనాల బాకాలు ఊదాయి!

ఇది ప్రగతి శీలకుడైన కవి ఆశించే నవ జీవనం. ఈ కవి - గతం మారుమూల కొమ్మల మాటున కూర్చుని కూసే పక్షి కాదు, దిగంతాలకు పరిభ్రమించే నిత్య స్వేచ్ఛా విహారి!

అందుకే-ఆయనకు ఆచారపు శృంఖలాలంటే అప్రియం. భర్త గతించినా, మామూలు వేషధారణతో ఉండే ఆమెను చూచి కవి నిరతిశయానందంతో-

వేషభూషలు తిలకాన్ని చూచి సంతోషించాను
పాత శాస్త్రాలకు కొత్త వ్యాఖ్యలని సంతసించాను- అంటారు.

ఈ ప్రగతి శీలత గోపాలరెడ్డి గారికి భాష విషయంలో మరీ ఎక్కువగా ఉంది. భాషను శాసించడం, నియమాలతో బంధించడం- వారికి ఇష్టం ఉండదు

వ్యాకరణ విజయమై యుంటే
భాష పిడసపారి ముద్దకట్టి ఉండేది!

భాష పిడస పోరటం - అనే అచ్చమైన వాడుక మాటలు వాడ గలిగిన కవిని వ్యాకరణ సూత్రాలు కట్టివేస్తాయా? 'గొప్ప కవిత్వం రాయాలంటే పదాలూ, సమాసాలూ, కవిత్వం కాదు కావలసింది. ఆత్మ ఔన్నత్యం, Rebellion, Struggle' అంటాడు కదా చలం !

ఉన్నత ఆదర్శాల రాజకీయ జీవితం గడిపిన వ్యక్తికి నేటి కలుషిత వాతావరణం పట్ల విచారం, కోపం! నేటి పదవీ కాంక్షాపరులు - 'మూర్తుల మరచారు - పురుషుల మరచారు' - అంటారు ఆవేదనతో! వాళ్లు-

ప్రజాభిప్రాయాన్ని తృణీకరిస్తారు
కడకు దాని మూటల క్రిందే నలిగిపోతారు.

మానవత్వం వారికి దైవత్వం ! మనిషిలో ఉండే మంచి గుణాలని వారు ప్రేమిస్తారు. స్నేహానికీ, ఆత్మీయతకూ కరిగిపోతారు. ఆ సుహృద్భావనను వారు మదిలోనే ముడి వేసుకొంటారు. ఆ దర్శనం ఈ సాత్త్విక రసపూరితమైన కవితలో ఉంది-

ఆమెతో జరిపిన సాహిత్య గోష్ఠి
ఆమె చతురోక్తుల సంభాషణా స్ఫూర్తి
ఆమె సాహచర్య సౌభాగ్య దీప్తి
నా మదిలో ముడి వేసుకొని ఉన్నాను
ఆ ముడి విప్పలేను - ఇతరులకు అందియ్యలేను !

ఒక చిన్న సన్నివేశం మస్తిష్కంలో మెరుపులా తాకినప్పుడు-ఒక స్మృతి రేఖ విద్యుత్తేజంగా మెరిసినప్పుడు, ఒక చమత్కార సిద్ధితో కవి కొన్ని వాక్చిత్రాలు గీయడం జరిగింది. ఒక సజీవ దృశ్యాన్ని ముక్తక పరిధిలో ఇమిడ్చి బొమ్మ కట్టించడం గొప్ప శైలీ విన్యాసం.

'అక్షరాలు ముత్యాలు' అంటూ ప్రారంభించిన కవిత రమ్యాతి రమ్యంగా సాగుతుంది. ఎన్నో అతి లోకమైన వర్ణనలతో ఆమెను వర్ణించి - కవి ఉత్కం

తతో ఆమె వంక చూస్తే - పాపం ఆమె ఏమంటుంది ? అజ్ఞాత ఆవేదనతో అంటుంది.

కవులు సవ్యసాచులు
ఒక చేతితో అతిశయోక్తి అలంకారాలు తొడుగుతారు
ఇంకొక చేతితో వేళాకోళాలు
విసురుతారు అన్నది
కన్నులు వంచి చిరునవ్వులు నిట్టూరిస్తూ.

చిరునవ్వులు నిట్టూరించటం అచ్చమైన గోపాలరెడ్డిగారి మాట ! ఇలా - భాషను తమకు కావలసినట్లు మలుచుకోగల డిట్టరితనం ఉంది. ఇది కవి స్వతంత్ర బుద్ధికీ, స్వేచ్ఛా ప్రియత్వానికీ నిదర్శనం. కొన్ని చోట్ల గ్రాంథిక ఛాయలు, మరికొన్ని చోట్ల వాడుక మాటల మూటలు ! కవి - తన ప్రాంతీయ భాషను ముద్దర ముడుపుగా అనేకులకు పరిచయం చేయడం భాషా విషయకమైన కొత్త సంప్రదాయాన్ని ప్రయోగించడం. గోపాలరెడ్డిగారు చేసిన నెల్లూరు ప్రాంతపు పద ప్రయోగాలు వారి కవిత్వానికి ఒక ప్రత్యేకతను సంతరించి పెట్టాయి.

ఒకప్పుడు గుంపుల మధ్య మసిలిన రాజకీయ వేత్త - ఇప్పుడు కోరేది ఏమిటో చూడండి !

'నేను కోరేది రసిక జన ఆర్ద్రితను
కొద్దిమంది సహృదయుల ఆసక్తులను'

'ఆమె'ను ఒక అపురూప భావనతో సృష్టించి-వారు అనేకమంది రసిక జనుల ఆర్ద్రితను, ఆసక్తులను ఆశించిన విధంగా పొందగలిగారు.

కవి ఊహైకజీవి. ఆమె విశ్వంభర. ఆ విశ్వంభరత్వాన్ని కల్పనా చమత్కృతితో శ్లోకించిన లలిత మనోజ్ఞ పంచ కావ్యాలు- ఈ 'ఆమె'ల తోరణాలు.

*   *   *

ఈనాడు తెలుగు వచనకవిత రాసిలో చాలా పెరిగింది. నినాదాలు, ఆర్తనాదాలు, విప్లవం, ఆకలి మంటలు- ఈనాటి కవితను ప్రళయ భీకరంగా మండిస్తున్నవి. ఆ మంటలలో రగిలి- నిగ్గు తేలి, సమతా జ్యోతుల్ని దర్శించటం ఈనాటి సాంఘిక ధర్మం.

కవిత్వం సామాజిక చైతన్యం కోసం. కవిత్వం రససిద్ధి కోసం కూడ. ఒక అనిర్వచనీయమైన రస స్వరూపాన్ని దర్శించి ఆ ప్రతిబింబాన్ని మూర్తి కట్టించడం కవి ప్రతిభకు నిదర్శనం.

లలిత కళలో, సాహిత్యమో- లేశ మాత్రంగానైనా లేక, రవ్వంత రసానంద స్ఫూర్తిని పొందలేని జీవితం వ్యర్థం అనిపిస్తుంది నాకు. ఇదే విష యాన్ని చలం చెబుతారు ఇలా-

"కవిత్వం, సౌందర్యం, ప్రేమ- ఇటువంటి విలువలు ఈనాటి మనుష్యు లలో లేవు' ఉన్నాయని ఘనతకోసం నటిస్తారు. సామాన్యమైన జీవిత వ్యవహారా లకు అతీతంగా- అప్పుడప్పుడన్నా మనసును ఏదో అలౌకికానందానికి గురి చేయగలిగే కళాత్మక విలువలు లేనినాడు మనిషి మనుగడ నిరర్థకం అని పిస్తుంది."

ఈ మామూలు జీవన పరిభ్రమణం నుంచి తప్పుకుని, జీవితాన్ని సమ స్యల వలయంగా కాక, కమనీయ కావ్యంగా మలుచుకోగలిగిన సాహిత్యకారులలో, కళాకారులలో అరుదుగా కనిపిస్తారు. అటువంటి వారిని చూచినప్పుడు జన్మ సార్థ కత పొందినట్లు అనిపిస్తుంది. గోపాలరెడ్డిగారిని చూచినప్పుడల్లా - వారి సాహిత్య వ్యక్తిత్వ ప్రాభవాలను గమనించినప్పుడల్లా- నాకు కలిగే భావం ఇది:

కవి కవిత్వాన్ని ఎందుకు వ్రాస్తాడు? అని ప్రశ్న వేస్తే, మనిషి ఎందుకు జీవిస్తాడు? అనే దానికి సమాధానం చెప్పుకోవలసి ఉంటుంది. వేయికి పైగా ముక్తకాలతో 'ఆమె'ను సృష్టించి- తెలుగు సాహిత్యంలో ఒక క్రొత్త రాగాన్ని మేళవింపు చేసి కవిగా చిరంజీవత్వం సంపాదించుకున్నారు గోపాలరెడ్డిగారు.

'ఆమె నీడల'లో వారు అంటారు- ''జీవితం తిప్పిన మలుపులు కొన్ని'' అని. ఆ మలుపులను ఒక వివేచనతో శాసించుకోగలిగిన నేర్పు వారికి ఉంది. ఈ నియమం వారి వ్యక్తిగత, రాజకీయ, సాహిత్య జీవిత మార్గాలలో కనిపిస్తుంది.

'ఇంతటితో ఆమెకు స్వస్తి
చాలాకాలము విసిగించింది'

అంటూ కవి 'ఆమె చెణుకులను' ముగించారు. ఝరీ వేగంతో కదిలే భావావేశం ఉన్నంతకాలం గోపాలరెడ్డిగారినే కాదు- ఏ కవినైనా సాహిత్య సుందరి విసిగించక మానదు! ఇది నా విశ్వాసం! ఆశంస! ఆకాంక్ష!

ఈ విహంగ వీక్షణం సమీక్ష కాదు. సమీక్షకులు చేయవలసిన పని మరొక విధంగా ఉంటుంది. ఈ కావ్య ఖండికలలోని రస స్వరూపాన్ని ఒక తన్మయీ భావంతో అనుభవించిన నా దర్శనం ఇది. ఈ వేయి సోయగాలను నేను విహంగ వీక్షణం చేయడానికి అనుమతించిన సుహృన్మిత్రులు గోపాలరెడ్డిగారికి నా హార్దిక వందనాలు.

హైదరాబాదు
తేది: 1-9-1982.

సి. వేదవతి

# నివేదన

ఆమె చెణుకులు ముగియుచున్నవి. దీనితో వేయి సోయగములను ఆమె పంచకము ముగియుచున్నది. దీర్ఘ కవితలు హ్రస్వముక్త పద్యకాలు ఒకదాని ఛాయలో మరొకటి నడచుచు వచ్చినాయి. 77 ఆగస్టులో అజ్ఞాత పర్షియన్ కవి పద్యముతో ప్రారంభమైనది యీ ఆమె పురాణము. పువ్వుకాగా మరల మొగ్గకాదు అని ప్రకృతి, కాలము వెనుకకు మరలవు. ఎప్పుడు ముందడుగే, ముందు చూపే అనే భావనతో ప్రారంభము. నాకు జ్ఞాపకమున్న కొన్ని ఉర్దూ భావాలను చెప్పవలెననే నా ఉద్దేశ్యము. ఆ మార్గముననే నడిచినవి కొన్ని, స్వతంత్రముగా నడిచినవి మిగతావన్నీ. అనుభవాలు, విన్నవి, కల్పించినవి, విమర్శలు, అభిప్రాయాలు వేయి సోయగముల కొలనులో చేరాయి.

రచనా కాలము, ప్రచురణ కాలము ఈ విధముగా ఉన్నది.

| | | పద్యకాలు | రచన | ముద్రణ |
|---|---|---|---|---|
| 1. | ఆమె | 202 | 77 ఆగస్టు<br>సెప్టెంబరు | 78 మార్చి |
| 2. | ఆమె జాడలు | 215 | 79 మార్చి<br>మే | 81 మార్చి |
| 3. | ఆమె నీడలు | 215 | 79 అక్టోబరు<br>80 మార్చి | 81 నవంబరు |
| 4. | ఆమె తళుకులు | 224 | 80 ఏప్రిల్<br>సెప్టెంబరు | 82 జూలై |
| 5. | ఆమె చెణుకులు | 229 | 80 అక్టోబరు<br>82 జూలై | 82 సెప్టెంబర్ |
| | | 1085 | | |

తలచిన దాని కన్న సంఖ్యలో పెరిగి వెయ్యిని దాటాయి .దీర్ఘ కవితలు నూటిని దాటాయి. కవితలలో ఒకే భావము అంత కష్టముగా తోచేదికాదు.

కాని ఈ హ్రస్వ పద్యకాలలో భిన్న భిన్న భావాలు. మొదడు ఎక్కువ కష్ట పడినది. అందుకనే ఆమె చాలా కాలము విసిగించింది అని స్వస్తి చెప్పాను.

కవితా కాసారములో కమలములు మాత్రమే పూయవు, కలువలు ఇతర మొక్కలు శైవాల లతలు జనిస్తాయి. లలితమైన శృంగార భావనలు, ముఖ్యముగ వియోగ శృంగార వేదనలు, విలాపాలనే వ్రాయ ఉపక్రమించాను. కాని భావాలు ఇటు అటు కూడా తిరిగాయి. అనేక విషయాలపై నాకున్న భావాలు, నిద్రాణములై ఇంతకాలము ఉండినవి, ఇందు రాజ్యమును నెలకొల్పు కున్నాయి. జీవిత చరిత్ర అంటే జీవితములో జరిగిన అనేక ఘటనలు, వివిధ సందర్భాలను పేర్కొంటుంది. ఈ ఆమె పంచకము నా భావ ఆవిష్కరణ అని చెప్పొచ్చు. కవితాత్మకమైనదీ ఉండొచ్చు, వాస్తవికతకు సంబంధించినవీ ఉంటొచ్చు. కిటికీగుండా చూచినప్పుడు అనేక విషయాలను చూస్తాము. చూడ చాలనివి అనేకములుంటాయి. అట్లనే ఉన్నవాటిని ప్రతిబింబించేది దర్పణము. లేనివాటిని చూపలేదు. ఇందు మబ్బులు కొంగలు మిణుగురులు మోదుగలు చాతక పక్షులు ఉన్నాయి. కొందరు కవులు కన్పిస్తారు. కవి సమయాలు, పురాణాలలోని నాయకులు, రాజకీయాలు, కట్టమంచి సరోజినీ నాయుడు వారి హాస్యోక్తులు - ఆమె కుంతల వితానము క్రిందే అన్నీ చేరాయి. భూమిమీద విషయాలను చూస్తూ గాలిపటము ఆకాశములో విహరిస్తుంది, పల్టీలు కొట్టుతుంది, ఇటు అటు పరిగిడుతుంటుంది. అట్లనే ఆమెకూడా. ఆమెకు ప్రకృతికి ఉన్న బాంధవ్యాలే ఇందు కన్పిస్తాయి. ఆమెకు అన్నిటితో చుట్టరికమున్నది. ఆమె తల్లికాదు, ప్రేయసి కాదు. కాని ఆమె ఏదికాదు? అన్నీ ఆమే. ఆమెకు సీమలు లేవు, నిర్వచనాలు లేవు. అన్నిటికీ అతీతమైన మూర్తి ఆమెది. ఒక ప్రతీక. అతీతమైన మూర్తిని ఒక్క దేహములో ఎందుకు చూడ యత్నించవలె?

నా అంకితాలు ఎప్పుడూ కీర్తిశేషులకే. నామీద అభిమానము చూపించో, లేక నేను వారిమీద అభిమానం చూపించిన కీర్తికాయులకే. ఏదో ఒక తృప్తి. అడిగి పుచ్చుకోవడములు ఏమీలేవు. శ్రద్ధా ప్రకటన మాత్రమే.

కృతజ్ఞతలు చెప్పదలచినప్పుడు, తొలుతగా చందూరు దంపతులకు చెప్ప వలసి ఉన్నది.నాకు 7,8 సంవత్సరముల క్రితము పరిచయమైనవారే.ఇద్దరూ ఎంతో

ప్రోత్సహించినారు, సాయపడినారు. ప్రచురణ వివరములు వారికే వదలినాను. ప్రూఫులు దిద్దినారు మద్రాసులో ముద్రణ జరుగుచుండినపుడు. ముద్రణ తొలి అడుగులో శ్రీ బి. యస్. ఆర్. కృష్ణ ఎన్నో సలహాలు ఇచ్చారు. ప్రేమగూడ పడ్డారు. క్రాంతి ప్రెస్సువారితో మాట్లాడడం వగైరాలు వారే చేశారు. ఆ సంస్థను సాహిత్య అభిమానులు మాత్రమే కాక నామీద అభిమానము చూపినవారు- ఆమె పంచకములో మొదటి పుస్తకమునకు శ్రీకృష్ణ 'చిత్తైన రీతి' అని తొలి మాట వ్రాసినారు. కడపటి పుస్తకమునకు శ్రీమతి మాలతి చందూర్ 'ఉన్న మాట' అని తొలిపలుకులు వ్రాసినారు. సాయపడినవారినే, కష్టము కూడ పడండి అని తొలి మాటలు వ్రాయించినాను. వారికి నా మొదటి నమస్కారాలు. రెండవ పుస్తకమైన ఆమె జాడలకు 'ముఖదీప్తి' అనే పేరుతో డా॥ నాయని కృష్ణకుమారి, 'ఆమె నీడలకు' డాక్టరు వాని భారతి 'ముందు మాట' పేరుతో, 'ఆమె అడుగులు'కు 'పీఠిక' అనే పేరుతో శ్రీ కోడూరి లీలావతి తొలి మాటలు వ్రాశారు. ఐదుగురు ఐదు పేర్లు పెట్టుకొన్నారు వారి తొలి పలుకులకు. వారు రచనల ద్వారా ప్రతిష్ఠలు పొందినవారు. నా అభిమానాన్ని పురస్కరించుకొని వారిని వ్రాయమని కోరితిని. తోడనే అంగీకరించి వ్రాసినారు. వారికి నా కృతజ్ఞతలు. తుది మాటగా 5 పుస్తకాలు మీద విహంగ వీక్షణం అనే పేరుతో వ్రాయమని శ్రీమతి సి. వేదవతి గారిని కోరినాను, శ్రీ పాండురంగయ్య వత్తిడికి తొందర తొందరగా వ్రాసారు. శృంగార లహరి, తెలుగు వెలుగు, అనే రెండు పుస్తకాలు నన్నెంతో ఆకర్షించినవి. ఆ అభిమానము, చనవుతో 5 పుస్తకాలను వీక్షించమని, ఐదు మాటలు వ్రాయమని కోరినాను. అంగీకరించారు. వీక్షించడము తేలికే. లిఖించడమే శ్రమతో కూడిన పని. ఎందుకు అంగీకరించితినీ అని కూడ అనుకొని ఉండవచ్చును. కాని ఇప్పుడు చేయగలిగినదేమీ లేదు వ్రాయడం తప్ప. నేను చూడకుండానే ముద్రణకు ఇయ్యమని కోరినాను. ఎవరి వ్రాతలో నేను ఒక్క మాట కూడ తీయలేదు, మార్చలేదు. ఆమెను క్షమాపణలు, కృతజ్ఞతలు, ఐదింతలు.

ముఖచిత్రం వేసిన శ్రీ గంగాధర్‌కు కృతజ్ఞతలు. ఆమె నీడలకు శ్రీమతి కమలేష్ ఆర్టిస్టు వేసి ఇచ్చినది ప్రస్తుతము క్వియెట్‌లో ఉన్నది. ఆమె చిత్రకారిణి, హిందీలో కవి. ఆమెకు, మా సాహిత్య అకాడమీ సభ్యులు శ్రీ మారే

మంత శ్రీనివాస్‌రావుకు కృతజ్ఞతలు. వృత్తిచేత ఆడిటర్. శ్రీశైల దేవస్థానములో పని చేయుచున్నారు. లలిత కళా అకాడమీ ప్రతినిధిగ సాహిత్య అకాడమీ సభ్యులు. ఉత్సాహవంతులు.

మద్రాసు క్రాంతి ప్రెస్సు వారికి, హైదరాబాదు శివాజి ప్రెస్సు వారికి, మాస్టర్ ఆర్టు ప్రింటర్సు, పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ వారికి నా కృతజ్ఞతలు. సహకరించి బాగా ముద్రించడానికి ప్రయత్నించారు. మంచి కాగితము మీద మంచి అచ్చుతోనే ముద్రణ జరిగిందని నా తృప్తి. ప్రచురణ జరిగిన ఆరు సంవత్సరాల పిదప కాపీ రైటు అందరిది. నా హక్కుల నేను వదలి వేసినాను. గిట్టుబాటు కాని చౌక ధరకే ఇయ్యాలని సంకల్పము. ఆంధ్ర సారస్వత పరిషత్తువారు అమ్మకం విషయములో చాల సహాయ పడినారు. పరిషత్తు ఒక ప్రజా ఉద్యమ ఫల స్వరూపము. అది ఏ ఒక్కరిది కాదు, అందువల్ల వారినే నా పుస్తకాలు అమ్మి పెట్టమని కోరినాను. పరిషత్తు వారికి, ముఖ్య కార్యనిర్వాహకులు శ్రీ దేవులపల్లి రామానుజరావుకు నా కృతజ్ఞతలు.

'వేయి సోయగములు' అనే ఆమె పంచకము సమాప్తము. వీని రచనలో నాకు ఎక్కువ శ్రమ కలిగినది. శ్రమ ఆనంద భరితము. మంగళం పాడి 'ఆమె' నుండి సెలవు తీసికొనుచున్నాను.

బెజవాడ గోపాలరెడ్డి

సుదర్శన మహల్
నెల్లూరు
5-9-82

నీవు కవయిత్రివి, గాయకురాలివి
కళాపోషణ కావిస్తూ, జీవితాన్ని గడుపుకో
పెండ్లిమాడుకో అన్నాడు తండ్రి.
అట్లానే, నాన్న, నీవు నాకు చేసిన
హితోపదేశము
నేనూ నా బిడ్డలకు చేస్తానులే అన్నది ఆమె.

2

నా నయన శుక్తులలో
ఎన్నో మౌక్తిక బిందువులున్నాయి,
ఎన్నడో నా యౌవన యాత్రలో
పడి మారాయి వర్షబిందువులు.

3

వలపు వగలు లేకుంటే
బ్రతుకు వగలు జ్ఞాపకానికి వస్తాయి.
సాహిత్యపు చింతన లేకుంటే
పుడిమి వగలు మేల్కొంటాయి.

**4**

ముదిమితెచ్చే సంశయాలను
మరవతలిస్తే
యౌవన వైభవాల ఏకతారను మీటాలె.
ఏదో కళావేశమో
హృదయ మృదంగాన్ని వాయించాలె.

**5**

ఒకనాడు కోరాను జనుల గుంపులను
ఈనాడు ఏవగించుకొంటాను ఆ గుంపులను.
నేను కోరేది రసికజన ఆర్ద్రితను
కొద్దిమంది సహృదయుల ఆసక్తులను.

**6**

రాజకీయాలకు కావాలె జనసమూహాలు
తలల గుంపులు, ఓట్లనిచ్చే చేతులు.
కళాకారులకు కావాలె
అభిజ్ఞుల హృదయాలు
మెచ్చే నయనాలు, శ్రవణాలు.

7

అతను రససింధువులో నిత్యసంచారి
సాహిత్య ప్రయాణములో కర్ణధారి
అతనికి యివ్వగలిగినదేమి
అర్ణవ విలోల తరంగాలకు
కవితా వీచికను శ్రుతికలుపుటకన్న.

8

సాగరానికి కావాలె
గోదావరి గలగలలు.
పర్వతాలకు కావాలె
వృక్షపత్ర గుసగుసలు.
గాయక విదుషీమణులకు కావాలె
తంబూరా తంత్రుల గుసగుసలు.

9

శక్తిలేని ఆసక్తులు.
సిద్ధిలేని ప్రసిద్ధులు.
నిధిలేని సన్నిధులు.
పురములేని అంతఃపురాలు.
మంత్రము లేని మంత్రులు.

**10**

నాట్యము చూచినప్పుడెల్లా
కమల నాట్యము స్మరణకు వస్తుంది
తులనాత్మక అధ్యయనము చేస్తాను
కమల నైపుణ్యం మిన్నగ తేలుతుంది.

**11**

ఏనుగులు ఒంటెలు ఖడ్గమృగాలు
శాఖాహారులు.
సింహాలు, పులులు, తోడేళ్ల
మాంసాహారులు.
మానవుడు సర్వశ్రేష్ఠుడు కాబట్టి
శాఖాహారి, మాంసాహారి.

**12**

జీవితగ్లానుల మరచుటకు
ప్రేమస్మరణ మురళిని మ్రోయిస్తాను
సంకటాల కంటకాలను దాటుటకు
సుఖవుమార్గము ప్రేమమార్గమే.

**13**

కామినీ కాంచనాలను వదలమన్నారు
కాంచనాలను వదలుట తేలికే
కామినిని వదలలేమని
మన ఋషులే ఋజువుచేశారు.

**14**

నేను బ్రహ్మము, బ్రహ్మములో కలిసిపోవాలంటూ
బెలూన్ మాదిరి ఎగిరిపోకుండా
మానవుని భూలోకానికి కట్టేస్తాయి
పడతులు పసిడి దారాలు.

**15**

దుఃఖరసాల అనుదినము
గిన్నెలతో పానము చేస్తున్నాను.
అలవాటైనది. రుచిమరిగాను.
దుఃఖాలు దుఃఖాలుగా కాన్పించుట లేదు
వాడినసుఖాల పువ్వురేకులవలె కాన్పిస్తున్నాయి.

16

శోకకంటకాల అంపశయ్యమీద
పరుండి ఉన్నాను.
భీష్మునివలె ఉత్తరాయనమునకు
ఎదురు చూస్తున్నాను.
శాంతిపర్వపు ఉపదేశములను
గరపుచున్నాను.

17

మరణరాజు ఛత్రచ్ఛాయల క్రింద
జీవితపు బానిస మసుచున్నాడు.
హఠాత్తుగ ఛాయలు మాయమగుతాయి
బానిస రోగశృంఖలాలకులో నలిగిపోతాడు.

18

మరణ గగనాన
జీవితము హరివిల్లుగ కాన్పిస్తుంది
ఏడువన్నెల సొబగులతో కాన్పిస్తుంది
ఎంత చక్కగ కాన్పిస్తుందో
అంత తేలికగ మాయమగుతుంది.

19

దేవుడు పరమ పావనుడు, మహాపరిశుద్ధుడు
మరణస్నాన పునీతులై జీవులు
అతని సాన్నిధ్యము చెందుతారు.
కర్పూరము హారతులలో కలిసినరీతి
కలిసిపోతారో
ధూమ్రముమరీతి ముందు తిరుగుచుంటారో
శంకరులు రామానుజులు కూడ
తేల్చలేకపోయారు.
చూచిన విషయము కాదుగదా !

20

పక్షి జీవితమనే పంజరము నుండి
విముక్తి పొందుతుంది
మృత్యులోకములో నలుచెరగుల
ఎగురుచుంటుంది.
అలసి ఏ చెట్టుమీదనో పుట్టమీదనో
పడిపోతుంది.

21

స్వల్పయౌవన కాలపరిమితిలో
జీవితమనే ఆమె ఎన్ని హేలల ప్రదర్శిస్తుంది
ఎన్ని ఆశలు, ఎన్ని నిరాశలు
ఎన్ని మహకారాలు, ఎన్ని తిరస్కారాలు !
అన్నీ ఆమెకు శోభను కూర్చేవే
అన్నీ ఆమె విలాసాలే వినోదాలే
చిత్రవిచిత్ర భావ హేలా సమ్మేళనమే ఆమె.

22

పునీత దేహాలపై
కలుషిత హస్తాలు దగ్ధమగుతాయి.
అధరాల మందస్మేరాలు.
అంతర్ధానమగుతాయి.

23

రాజు తర్వాత యువరాజు
పట్టాభిషేకానికి ఎదురుచూ స్తుంటాడు
ముఖ్యమంత్రి తర్వాత
అజ్ఞాత ముఖ్యమంత్రులు
పుట్టే ఉన్నారు, చేతులు చాచుచునే ఉన్నారు.

24

ఏ ముఖ్యమంత్రి కడపటివాడుకాడు
క్యూలో చాలమంది నెట్టుచునే ఉన్నారు.
తిరుమలై దేవదర్శకులు
పదా పదా అని అంటున్నారు.
దర్శనము క్షణకాలము
క్యూ చాల దీర్ఘము.

25

పదవుల పెదవులు
ఎర్రగా ఉన్నాయి.
పడుపు తప్పితే
పెదవుల పర్దాలో
పన్నులు తెల్లగా ఉన్నాయి
కొరికి పిప్పిచేస్తాయి.

26

పుణ్యాంగనలో పణ్యాంగనలో
తెలియదు పదవుల నిచ్చెనమీద
నియంతలమని తలుస్తారు
ప్రజాస్వామికపు నిచ్చెనమీద.

27

సర్వము తమకు ఎరుక అని తలుస్తారు
తమ సంకల్పమే దైవ సంకల్పమని తలుస్తారు
ప్రజాభిప్రాయాన్ని తృణీకరిస్తారు
కడకు దాని మూటలక్రిందే నలిగిపోతారు.

**28**

చరణసింగు రెండుసార్లు ముఖ్యమంత్రి అయ్యారు
ఒకసారి ప్రధానమంత్రి అయ్యారు.
ఎప్పుడు ముహూర్తము చూచి
అకాలములో పదవీ స్వీకారము చేశారు.
ఎప్పుడు పదకొండు మాసాలు
రాజ్యాధికారము దాటలేదు.
పడిపోడానికి ఏ ముహూర్తము మంచిదో
చూచుకొనే ప్రమాణాలు చేశారు.

**29**

పడిపోయ్యే ముఖ్యమంత్రులు
మందిరాలు, మస్జిదులు, చర్చిలు దర్శించారు
దేవుళ్లకు బాబాలకు మ్రొక్కారు.
మూర్తుల భజించారు మనుషుల మరచారు
పదవీవిరమణ తర్వాత
మనుషులమీద అక్కరను చూపారు.

**30**

చీరకు అంచుమాదిరి
అలలు సముద్రానికి అంచులు
అంచులలోనే అలలు కుచ్చెళ్ల మాదిరి ఎగిరేవి
నడి సముద్రములో లేవు తరంగాలు.

31
సముద్రపు చీరకు
కొంగు సికత ప్రదేశాలు.
బంగారు వన్నెను దాల్చి ఉంటాయి
రజత తరంగాలు స్వర్ణ సైకతాలు
నీలసముద్రానికి ఆభరణాలు.

32
సముద్రానికి తరంగాలు
ఆకాశానికి మేఘాలు
భువనానికి అరణ్యాలు
ప్రకృతి లీలల ప్రదర్శిస్తాయి.

33
రాధ మధుర మోహావేశము
ప్రేమపరాకాష్ఠను సూచిస్తుంది
కలియుగాన రాధే
చైతన్య ప్రభువుగ జన్మించింది.

**34**

తమాల వృక్షాలు
నీల మేఘాలు
నీల నీరాలు
శ్యామ సుందరుని
నీల రూపచ్ఛాయల
కృష్ణప్రియకు స్మరణకు తెచ్చేవి.

**35**

తమాలశాఖా పత్రాలలో
మయూర కలాపనేత్రాలలో
మురళీధరుని సుందరస్మిత అధరాలను
రాధ తిలకించేది
పరిసరముల విస్మరించేది,

**36**

రాధ కృష్ణుని నిత్యసాక్షాత్కారము
కోల్పోయింది
అశ్రుభరిత విరహ నిశీథముల
మిగుల్చుకొన్నది.

37

అన్ని మతాలూ సమానమే
సన్మార్గాలు చూపేవే
మానవతా శతదళము
అన్ని దళాల విప్పి
అన్యోన్యంగ ఉంటేనే
సౌభ్రాతృసుగంధాలను వెదజిమ్మేది.

38

ఈద్ ఉల్ జుహా పండుగనాడు
అన్ని ఖండాల అన్ని రంగుల ముసల్మానులు
హజ్ పూర్తిచేసి
మక్కాలో నమాజు చేస్తారు.

39

కొడుకును బలి యిమ్మని కోరాడు
తండ్రి ఉద్యుక్తుడయ్యాడు
కరవాలము పుష్పహారమయ్యింది
మేకను చంపి మూడోవంతు
పేదసాదలకు పంచారు ఈ పండుగనాడు.

**40.**

తిరుపతి యాత్రికులు
హుండీవసూళ్లు అధికము లయ్యాయి.
నైతిక పతన మయ్యిందని చాటేవారికి
వ్యతిరేకముగ సమాధానము దొరికింది.

**41**

ప్రకృతి రచియించే భావగీతికలే ఈ వృక్షాలు.
కేవలం సౌందర్యాన్ని ప్రదర్శించే చెట్లు
పూలచెట్లు పండ్లచెట్లు
భిన్న భిన్న ఛందస్సులలో
రచించిన పద్యాలే.

**42**

నికషోపలము ఆమె జిహ్వా
అన్నిటినీ పరీక్షించి విలువల తేల్చేదే.
ఆ రాతి మీదనే మంచి చెడ్డలు తేలాలె.
అసలునుండి తుక్కును వేరు చేయాలె.
ఆమె చెప్పిందే మంచి, మెచ్చిందే మెరుగు.

43

రాధ ప్రేమలతకు కావాలె
గానలోలుని భుజస్కంధాలు
రుక్మిణి భక్తి సుమాలకు కావాలె
శ్యామసుందరుని పాదారవిందాలు
సత్యభామ సరసాలకు కావాలె
నందగోపాలుని స్మేరజ్యోత్స్నలు
గోపికల నృత్యవినోదాలకు కావాలె
బృందావన కృష్ణుని దివ్యవంశీరవాలు.

44

పెద్దకొడుకు బాగా చదివాడు
ఉద్యోగములో చేరాడు
రెండవవాడు పరీక్షలు తప్పి
కంట్రాక్టరై ద్రవ్యము బాగా ఆర్జించాడు
కడపటివాడు ఉద్యమాలలో చేరి
మంత్రియై రాజ్యాన్ని ఏలాడు
చదువులకు అంతస్థులకు
సంబంధము లేదని చాటారు.

45

ఆమె లీలలు నిత్యనవీనాలే
సదా ఆకర్షణ అయస్కాంతాలే
ఆమె వీక్షణాలలో స్పర్శమణులున్నాయి
చూచినదంతా పసిడివన్నెలతో వికసించేదే.

46

మేఘముల నర్తకీబృందము
నృత్యము సలుపుచుండ
పర్వతములు కూర్చొని కొన్ని
పరుండి కొన్ని మోచేతుల మీద
వాలి కొన్ని పరికించుచున్నాయి.

47

మేఘములు పర్వతములపై
ఆనుచున్నవి వాలుచున్నవి
కౌగలించుకొనుచున్నవి
స్పర్శచే అవి పులకితమగుచున్నవి
విద్యుత్ కటాక్షములతో వికచితమగుచున్నవి
గర్జారవములకు ఆనందవిహ్వలమగుచున్నవి.

48

మబ్బులగూడులు కొండల మీదే
అచ్చటనే పిల్లల పొదుగుచున్నవి.
రసధునులు పుట్టి యిటనట పరుగిడుచున్నవి
క్రిందకు దుముకుచు గంతులేయుచున్నవి.

49

మధుర సంగీత వైభవము
ఏడు స్వరములలో ఇమిడి ఉన్నది.
ఆరోహణ అవరోహణాలలో
రాగసుధను విరజిమ్ముచున్నది.

50

మాటలు పుట్టించనేరని మధుర రసాన్ని
సంగీతము సృష్టిస్తుంది.
పాటకు ఆట కలిస్తే
ఆటకు అందము ఒనగూడితే
హృదయము రసప్లావితమగుతుంది.

51

మబ్బు ఏనుగుల కాపరి
చేసే మందలింపుకే ఉరుములు
అప్పుడప్పుడు మెరుపు కొరడాను
ఝళిపిస్తుంటాడు.

52

విరహిణి నిశీథిని కార్చే
కన్నీటి బొట్లే
మిణుగురు పురుగుల వెలుగులు.

53

గూటిని వదలిన తలపు పిట్టలే
మనోగగనాన తిరుగుచునుంటాయి
రాత్రంతా తిరిగి తెల్లవారగానే
ప్రేయసి ఒడిలో చేర్తాయి.

54

ఎవని నామము జపిస్తు
రేయింబవలు
ఆనంద విహ్వాలుడగను
విరహ విధురుడగను
అగుచున్నానో
ఆమె నా స్నేహితులకు ఏమీకాదు
అందరి యువతులలో ఆమె ఒకతె వారికి.

**55**

మోహనమంత్ర ప్రభావాన్ని
గుప్త ఇంద్రజాల మహిమను
మౌనహాసధారల సుధను
నా మీదనే ఎందుకు వెదచల్లింది
ఇలలో నన్నే ఎందుకు ఎన్నుకొన్నది.

**56**

ఆమె జవ్వన వలపు వేటకు బయలుదేరింది
హేలావిలాసాల వలల విసరింది
క్రీగంటి చూపుల చిరునవ్వుల ఉచ్చుల పన్నింది
ఆమె వేటకు నేనే ఎందుకు బలి అయ్యాను
ఈ వేట మర్మాలు ఇతరులకు ఎట్లా అర్థమగుతాయి.

**57**

నానౌక తెరచాపలు
అందంగా ఉన్నవని
జీవితములో చాలా అపవాద ఝంఝూవాతాలకు
గురిఅయ్యాను.
ఇంకొక తుఫానును నేను తట్టుకోగలను
ఆ కఠిన బాధ్యతను నాకే అప్పగించండి
అన్నది ఆమె నిస్సంకోచంగ
ఆమె సాహసానికి అందరు
హర్ష అభివాదాలు తెల్పారు.

58

ఢిల్లీ పరిచయురాలుని
మద్రాసులో కలిశాను
మీ వారు ఎక్కడ ఉన్నారండీ అని అడిగాను.
వారు పోయారు మద్రాసుకు వచ్చేశాను అన్నది
భర్తపోయినందుకు విచారించాను.
వేషభూషలు తిలకాన్ని చూచి సంతోషించాను
పాతశాస్త్రిలకు క్రొత్త వ్యాఖ్యలని సంతసించాను.

59

శాస్త్రాలు పురాణాలు పాతవే
పెద్దలు వ్రాపి వారసత్వముగ ఇచ్చినవే
పల్లవి పాతదే
చరణాలు క్రొత్తవి
అసలు పాతదే
నకిలీలు క్రొత్తవి
ఈ శతాబ్దపు నవీనులు రచించినవే.

60

పర్వతాలు అచలముగానే ఉన్నాయి
పుట్టే నదులు గతులు మారుస్తున్నాయి
క్రొత్త మునకలు వేస్తూ ఉన్నాయి
క్రొత్త మెరకలు లేవ నెత్తుచున్నాయి.

**61**

శుక శారికలు

పాతగగనమూలముల వదలి
క్రొత్త దిగంతముల చేరాయి
క్రొత్త మాటల పాటల నేర్చాయి.
క్రొత్త దినాల బాకాలు ఊదాయి.

**62**

చెట్టు పాడిదే

క్రొత్త ఉగాది వసంతము వచ్చింది
క్రొత్త మామిడి పూతలతో అలంకరించింది
క్రొత్త కోకిలకు సరిగమ పలుకనేర్పింది



**63**

సీతను లంకాపురివనములో నిర్బంధించారు
అశోక తరువులు కావలి కాచాయి
ఆమె వ్యథను నిత్యము చూచి చూచి
శోక తనువులై పళ్లాల రాల్చాయి.

64

నీ హస్తాలు కోమలాలు సుకుమారాలు
ఏ భుజాలకైన మస్తకాలకైన శోభను కూర్చేవి
తన్మయత్వాన్ని పుట్టించేవి.
అంట్లు తోముచు వంటగదిని తుడుస్తుంటే
జాలితో గుండె నీరై పోయింది.

65

ఇంటి అమ్మాయి పరుగిడుతుంటే
అందాల వాగుగ ఉండేది
నిలిచియుంటే పద్మాల కోనేరుగ ఉండేది.

66

తెల్ల కలువవలె వెలిగింది
విద్యుత్‌దీపము రాత్రి చీకట్లలో
కలువతూడు
వంచల మైళ్ల పొడవుగ ఉంటుంది.

**67**

మంచు చీరెతో తీగలు కాన్పించక ఉన్నాయి
సూర్యుడు దుశ్శాసన కరములతో
చీరను తొలగించాడు.
లతలు లజ్జతో తుహిన బిందువుల కార్చాయి
అక్రమ కార్యానికి
మేఘాలు ఆగ్రహించి ఆక్రమించాయి.

**68**

తారా శిశువుల బుజ్జగిస్తు
తూగుచున్నది రాత్రి
మంచు దుప్పటిని కప్పకొని
విహంగ కలస్వనాలకు
మేల్కొని ఆవలిస్తు లేచింది.

**69**

గ్రహాల జపమాలను త్రిప్పుచు
కాలుడు దీర్ఘపూజలో ఉన్నాడు
యుగాలు గడచుచున్నవి.
పూజసమాప్తి ఘంటలు వినబడవు
ప్రళయరాత్రి తిమిరాలలోనే
అశనిపాత ఘోషలలోనే వినపడతాయి.

**70**

చలికాలము కాళ్లు ఈడ్చుకొంటు
వెడలిపోయిందని తలచాను.
మేఘ వల్మీకములలో దాగి
విషవాయువుల వెళ్లగ్రక్కుచునే
ఉండుట చూచాను.

**71**

పుణ్యాంగనల పునీతదేహాలపై
కాపురుషుల కలుషిత హస్తాలు
కుబుసాలవలె ఎగిరిపోతాయి.

**72**

విశ్వశాంతికై
ఘోర సమరాల జరుపుతారు
సమరాల గర్భంలో
శాంతి పిండాలకై వెదకుచునుంటారు.

73

గాయకుడు స్వరాలతో ఆడుకొంటాడు
చిత్రకారుడు వర్ణాలతో ఆడుకొంటాడు
కవి పదాలతో ఆడుకొంటాడు
ఆకాసము నక్షత్రాలతో ఆడుకొంటుంది.

74

గగనము మేఘాలతో ఊగుతుంది
సాగరము తరంగాలతో ఊగుతుంది
కవి భావాలతో ఊగుతాడు
ప్రేమికుడు స్వప్నాలతో ఊగుతాడు.

75

వసంతముచే ఉద్యానవనములు
పులకిత మగుతాయి.
వర్షముచే నదీనదములు
పులకిత మగుతాయి.
పుష్పమాలికలచే కబరి
పులకిత మగుతుంది.
పరిరంభణములలో ప్రేమికులు
పులకిత మగుతారు.

**76**

ఝిల్లీ స్వనములచే విహ్వాల మగుతాయి
నిశితి మిరాలు.
మత్తసౌరభాలతో విహ్వాల మగుతాయి
లతాంత మండపాలు.
విహంగ కాకలీ రవములతో
విహ్వాల మగుతాయి వృక్షశిరాలు.
వర్షపాతముతో విహ్వాలమగుతాయి
నగ శిఖరాలు.

**77**

మంజీర రవళులచే
ముఖరితమగుతుంది హృదయము.
మందస్మితములతో
శోభితమగుతాయి కపోలాలు.
అలకలతో దీపిస్తుంది
ముఖఫలకము.
హస్తభాంగిమలతో సంభాషిస్తుంది
జవ్వని నృత్యము.

**78**

అర్ధనగ్న మహాత్ముని సమాధిని
రాజఘాట్ అని పిలిచారు.
స్వతంత్రసమరయోధుని సమాధిని
శాంతివనమని పిలిచారు.
నమ్రతనే శిరమున తాల్చి
ఆత్మోత్సర్గము చేసిన వాని సమాధిని
విజయఘాటని పిలిచారు.
అన్నీ ఢిల్లీ యాత్రికుల
దర్శనధామములయ్యాయి
స్వాతంత్ర్యవీరుల చిరతల్పము లయ్యాయి.

**79**

పందమంది సామగ్రి
తయ్యారు చేయాలె
ఒక్క సైనికుడు యుద్ధరంగానికి
నడవడానికి.
వేయి పూవులు పుయ్యాలె
ఒక ఆమని రావడానికి.

**80**

మాటకు కావలె భాష
ఏడ్పుకు అక్కరలేదు.
నవ్వుకు అక్కరలేదు.
సంగీతానికి అక్కరలేదు భాష.

**81**

అంగముల మౌన భాష నృత్యము
ఆ భాషనే ముద్రలు అన్నారు.
ముద్రలతోనే ఏ భావాన్నైనా ప్రకటించొచ్చు
భాషాతీతమైన నృత్యము విశ్వజనీనము.

**82**

దేవుని కనుగొనడానికి
బయలుదేరాడు నరుడు
వెదకి వెదకి చివరికి
కనుగొన్నాడు మానవుని
ప్రత్యక్షదైవమే మానవుడు.

**83**

శిశు వ్యాకరణము వ్రాశాడట
వేంకటరాయశాస్త్రి
ప్రచారములోకి రాలేదు.
బాలవ్యాకరణము ప్రౌఢవ్యాకరణము
ప్రచారములోకి వచ్చాయి.
వృద్ధవ్యాకరణము వ్రాయాలె
కళాప్రపూర్ణుడు ఎవడైనా.

**84**

ఫిడేల్ మృదంగము మాత్రమే కాదు
గాయకునికి తోడ్పడేది
వెనుక దాగిన తంబూరా కూడా
సాయపడుతుంది.

**85**

పాటగాని ఎదురుగా
ఆడేవి ఫిడేల్ మృదంగాలు
వెనుకనుండి ప్రోత్సహించేవి
తంబూరా తీగెలు.

**86**

అందరికి కనబడేవి
ప్రక్క-వాద్యాలు
శాస్త్రయుక్తమైన రాణులు.
శ్రుతికలిపే ప్రేయసులు
కావాలె పాట పండుగులలో
కానిపించని ముసుగులతో.

**87**

గంగ యమునలు
ప్రక్క-వాద్యాలు
అంతర్వాహిని సరస్వతి చేరాలె
త్రివేణీ గాన సంగమానికి.

**88**

అన్నీ వేదాలలో ఉన్నవని అంటారు
విమానాలను పూర్వులే సృష్టించారంటారు
కొత్త ఏమీ లేదు వారికి
అంతా పాత ఘోషాణములోనే ఉన్నదంటారు.

**89**

భావ కవిత్వానికి ఆద్యుడు తిక్కన్నే
రాయప్రోలు దేశభక్తి గీతాలకు
వైతాళికుడు తిక్కన్నే
రామిరెడ్డి గ్రామీణ జీవనవర్ణనానికి
ఆద్యుడు కృష్ణరాయలే
కృష్ణశాస్త్రి ఏడ్పులు శ్రీనాథుడులోనే ఉన్నాయి
క్రొత్త క్రొత్త అనడమేగాని
అంతా పాత పాతరలోని దినుసులే
అంటే తృప్తి పాత ఛాందసులకు.

**90**

అభ్యుదయవాదిగా ఉండాలంటే
గురజాడను పొగుడ్తూ ఉండాలె
అన్ని మంచి తీరుల ప్రారంభకుడని అనాలె
అప్పుడప్పుడు సామాజిక స్పృహ అంటూ ఉండాలె
ప్రజల హితవుకొరకే సాహిత్యం
అని భజనలు చేస్తూ ఉండాలె.

**91**

సాహిత్యోపన్యాసానికి
కొన్ని చిటుకులు చిట్కాలు సేర్వాలె
క్షేమేంద్రుడు అని అంటూ ఉండాలె.
రసము ధ్వని వక్రోక్తి అనే పదాలు
తూకానికి వేస్తూ ఉండాలె
పాశ్చాత్య విమర్శకులను ఉల్లేఖిస్తుండాలె
అప్పుడే సమగ్ర సాహిత్య విమర్శ అని బల్ల గుద్దాలె.

**92**

పగ్గాలులేని గుర్రం జీవితము
ఎందుకు ఎక్కడ ఎప్పుడు ఆగుతుందో
తెలియదు స్వారిచేసే రౌతుకు.

**93**

జీవన చక్రాలు
ప్రయాణాల చక్రాల ఇరుసుమీదే
తిరుగుచున్నవి సాగుచున్నవి.
అందులకే ప్రయాణాల బలిమి తగ్గుటలేదు.

94

నా అనారోగ్యస్థితిలో
భోజనాల మధ్య
చిరుతిండుల తిని
వ్యభిచార పశ్చాత్తాపాన్ని
పొందుచుంటాను.

95

ఈ బై-ఎలక్షన్ గెలిచి
జస్టిస్ పార్టీకి
కాంగ్రెసు గుడ్-బై చెప్పాలని కోరాడు
కట్టమంచి మద్రాసు సభలో.

96

నా ఆత్మ స్వదేశీయే
కాని నా ఉదరము విదేశీదే
పాశ్చాత్య రీతిలో భోజనము వడ్డించే
హోటల్‌లోనే దింపండి
అని వ్రాశారు డాక్టరు రామలింగారెడ్డి.

**109**

మధుర పదార్థాల ఆనందిస్తుంది నాలుక
ప్రియవచనముల సత్యముల పలుకుతుంది
కాని సకల రోగాలకు మూలము నాలుకే
సర్వకలహాలకు జన్మభూమి నాలుకే.

**110**

దేహానికి మెదడుకు శత్రువు నాలుక
నాలుకను అదుపులో పెట్టుకొంటే
ఎంత హాయిగ ఉంటుంది, ఆనందంగ ఉంటుంది
అది యోగీశ్వరులకే సాధ్యమయ్యేది.

**111**

నాలుక చేసే అల్లర్లను మాన్పడానికి
ఉపవాసాలు మౌనాలు శాస్త్రాల్లో వ్రాశారు
బూజు పట్టిన శాస్త్రాలనే రోజుల్లో
ఉపవాసాలు మౌనాలు ఆచరించే వారే అరుదు.

**100**

ఈ వత్సరము ఆంధ్రులకు
మకర సంక్రాంతి మర్కట సంక్రాంతి అయ్యింది
అంజయ్య మంత్రులందరు
రాజీనామా చేశారు.
కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి
ఏ తెలుగు పుస్తకానికి లభించలేదు.

**101**

మా తెలుగు తల్లికి మల్లెపూదండ
పాటను అరవం మాట్లాడే
సుందరాచారి వ్రాశాడు.
ప్రభుత్వం దానిని ఆమోదించింది.
మద్రాసులో, ఢిల్లీలో
ఆంధ్ర జిల్లాలలో దాన్నే వింటుంటాము.

**102**

త్యాగయ్య కృతులు
తమిళ దేశములో రచింపబడ్డాయి.
రఘునాథరాయలు అక్కడే ఏలాడు.
అన్ని జిల్లాలలో తెలుగువారున్నారు.
ఆంధ్ర బీజానికి తమిళ ప్రాంతం
సారవంతమైన క్షేత్రముగ తేలింది.

**103**

మునుస్వామినాయుడు రాధాకృష్ణ
తెలుగువారైనా తమిళ ప్రాంతపు
తిరుత్తనివారే.
గిరి గిడుగు తెలుగువారైనా
ఒరియా ప్రాంతంవారే
విశ్వేశ్వరయ్య తెలుగువాడైనా
కర్ణాటక ప్రాంతమువాడే.

**104**

సుబ్బరాయలరెడ్డి
మద్రాసు మొదటి ముఖ్యమంత్రి.
మునుస్వామినాయుడు,
రామస్వామిరెడ్డి,
కుమారస్వామి రాజా
తర్వాత ముఖ్యమంత్రులయ్యారు.
అందరు తెలుగు మాతృభాషగ కలవారే
తమిళ ప్రాంతం నుండి వచ్చినవారే.

**105**

నెల్లూరు తిరుపతి
పేర్లు బట్టి తమిళులవైతే
శ్రీరంగం శ్రీవిల్లిపుత్తూరు
ఆంధ్ర రాజ్యములో చేరాల్సిందే.

**118**

పుట్టుకకు తల్లి ప్రక్క ఉంటుంది
తల్లికి భర్త ఉంటాడు
చావుకు ఎవరు అక్కరలేదు
ఏకాంతముగ చావొచ్చు
శ్మశానానికి మనుష్యులో వాహనమో కావాలె.

**119**

రామథావు నాగేశ్వర రావులు
మనస్ఫుటుల వలె ఎదుగుచునే ఉన్నారు
శాఖావాహువుల ఎగరేస్తూ ఉన్నారు.
కండ్ల ఎదుటనే లతాంగులు చాలమంది
యౌవన పుష్పాల ఎగరేస్తూ వచ్చారు
వాడిన రేకులు వదలుతు వెళ్లారు.

**120**

హైందవ సంస్కృతికి మూల స్తంభము
భారతము
రామాయణ భాగవతములతో సహా
ప్రముఖ కావ్యమే భారతము
సమర ధర్మము మాత్రము లోపించింది
ఏ సేనాపతి న్యాయంగా చంపబడ్డాడు ?
భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, సుయోధనుడు ?

**97**

దేశములో హిందూ మెజారిటీని ఒప్పనని
పంజాబు బెంగాల్ రాష్ట్రాలను
ఇయ్యమని కోరాడు జిన్నా.
ఆ రాష్ట్రాలలో చాల జిల్లాలలో
హిందూ మెజారిటీగ ఉన్నది
దేశములో హిందూ మెజారిటి నరకమైతే
పంజాబు బెంగాల్ జిల్లాలలో ముస్లిం మెజారిటి
వైకుంఠమగుతుందా
అని ప్రశ్నించాడు జిన్నాను డాక్టర్ రెడ్డి.

**98**

హిందూ గణితము అనర్థమైతే
ముస్లిం గణితము గ్రాహ్యమగుతుందా
అని కూడా ఆ సందర్భములోనే ప్రశ్నించాడు.

**99**

ఢిల్లీ చలిలో
కొన్ని దినాలుండి
స్వల్ప కాయకల్ప చికిత్సను
పొందినట్లుగ భావించాను.

**112**

లింగ వ్యత్యాసాలను చూపేది
ఆసుపత్రిలో ఆయాలు
సాహిత్యములో సంస్కృత పండితులు
పుం స్త్రీ లింగాలె కాక
నపుంసక లింగం పెచ్చుగ గమనిస్తారు.

**113**

తెలుగులో స్త్రీ లింగము లేదు
నపుంసక లింగములో చేరిపోతుంది.
పుంలింగ నపుంసక లింగాలే
తెలుగు వారికి మిగిలాయి.
అరవములో శబ్దాన్ని బట్టి గాక
వస్తు భేదముతోనే లింగవ్యత్యాసము తేల్తుంది
మూడు లింగాలు ఉన్నాయి.

**114**

సంస్కృతములో జాయా శబ్దము స్త్రీ లింగము
దార శబ్దము పుంలింగము
కళత్రం నపుంకలింగము
అన్నిటి అర్థాలు భార్యే.

**115**

హిందీలో లింగ భేదాలు కఠినాలు
కొన్ని కొండగుర్తులున్నా
ప్రతిశబ్ద లింగాన్ని నేర్వాల్సిందే
కర్తకు నే ప్రత్యయము చేర్చి
కర్మలింగము మీద ఆధారపడుతుంది క్రియ
సీతానే ఫల్ ఖాయా
రాంనే బాత్ కహీ

**116**

రవీంద్రుడు హిందీ నేర్వ ఆరంభించి
మీసాలు దాడి పోలీసు మిలిటరీ
శబ్దాలు స్త్రీ లింగమని
స్తనము పుంలింగమని తెలిసికొని
హిందీ తనకు రాదని వదలి వేశాడు.

**117**

బెంగాలీలో లింగభేదాలు లేవు
మూడు లింగాలు ఒకే లింగమౌతాయి
షి ఆషె అంటే వాడు వచ్చాడు, ఆమె
వచ్చింది, అది వచ్చింది అనే మూడింటికి
ఒకే మాట.

**106**

అభిమానానికి లొంగిపోతాను
అధికారాన్ని ధిక్కరిస్తాను
బలవంతాన్ని ఎదిరిస్తాను
పొగడ్తలకు లొంగక తిరస్కరిస్తాను.

**107**

అభిమానములో
కాన్పించని అధికారమున్నది
అభిమానభరిత విజ్ఞప్తులు
అదృశ్య అధికార ఆజ్ఞలగుతాయి
అట్టి ఆజ్ఞలకు లొంగుటే ఆనందం.

**108**

దాంపత్యపు పందెములో
పరాజయాలు
తియ్యంగానే ఉంటాయి.
జీవితములో చేదుగా ఉంటాయి.

**121**

శకుని కపట ద్యూతాలు
శల్య సారథ్యాలు
స్వపక్షత్యక్తుని చేయ
కర్ణునికి చూపిన ప్రలోభాలు
రసమును చిందే ఘట్టాలే
నీతి విదూరములైన ప్రకరణాలే.

**122**

సుయోధనుడు పాండవుల పట్ల
ఈర్ష్యాళువై వర్తించాడు
ద్రౌపది ఎడ క్రూరముగ వర్తించాడు
పాలితుల ఎడ, మహిళల పట్ల
క్రూరముగ ప్రవర్తించలేదు.

**123**

రాజులలో హెచ్చు మంది
సుయోధనుని పక్షమునే చేరారు.
పదకొండు అక్షౌహిణుల సైన్యము సమకూర్చాడు
భీష్ముడు ద్రోణుడు కౌరవ పక్షముననే
నిలిచి పోరాడారు.
ప్రజాతంత్ర సూత్రాల ప్రకారము
పై చెయ్యి అతనిదే
యుద్ధములో ఓడినా.

**124**

ధర్మరాజు వంటి అసమర్ధుడు కపట వర్తనుడు
కర్ణుని వంటి ప్రభుభక్తి పరాయణుడు
భీముని వంటి అగ్రజభక్తి పరాయణుడు
వేరు కాన్పించరు భారతములో.

**125**

ధర్మరాజు జూదానికి ఎందుకు బానిసయ్యాడు
అక్రమ జూదమని తెలియనేరని దద్దమ్మ
రాజ్యాన్ని సోదరులను తన్ను భార్యను
పందెములో ఒడ్డి, ఓడి
మరి ఏ ఇతర ప్రపంచ ఇతిహాసములో
కాన్పించని అద్వితీయ అవివేకి అయ్యాడు.

**126**

సోదరుల అరణ్యవాసాల కష్టాల చూచి
విరాటుని కొలువులో జరిగిన
అవమానాల కథల విని
అన్నిటికీ తానే కారణభూతుడని
ధర్మజుడు ఎన్నడైన పశ్చాత్తాప పడ్డాడా
ఆత్మనింద ఎన్నడైన చేసికొన్నాడా?

**127**

మైమరపులో భ్రమలో
తప్పిదము చేయొచ్చు
పర్యవసానాల చూచి
పశ్చాత్తాప పడుట
కనీస మానవ ధర్మము కదా
అది కూడ ధర్మరాజు ఎందుకు చేయలేకపోయాడు.

**128**

మెత్తని పులి అన్నాడు తిక్కన
పెను వేపవిత్తు అన్నాడు వేమన
జూదరి అన్నది ద్రౌపది ధర్మజుని గూర్చి
నిర్విష భుజంగము అంటాడు నవీనుడు.

**129**

తమిళులు భారతాన్ని క్రింది చూపు చూశారు
ఇతర భాషలలో కూడ మాన్యత తక్కువ
ఆంధ్రులు మాత్రము పైకెత్తి శిరమున వహించారు
అక్షర రమ్యత ఆంధ్రావళి మోదమొంద
అని పదే పదే అంటారు
వింటే భారతము వినాలె
తింటే గారెలు తినాలె
అంటు ఆనందిస్తారు.

**130**

ఆమె ఎప్పుడు బాగుండదు
ఎల్ల వేళల అందంగానే ఉంటుంది
మాట్లాడినా మౌనంగా ఉండినా
నవ్వినా కన్నీరు పెట్టుకొన్నా అందంగానే ఉంటుంది.

**131**

కుమార్తెను పెంచి పోషించి
బడికి పంపి యం. ఏ. వరకు చదివించడం
వివాహము చేసి పంపాడంటే
పెద్ద యజ్ఞము చేసిన సోమయాజనే చెప్పొచ్చు.

**132**

ప్రకృతి రచించిన మాయలలో మాయ
స్త్రీ పురుషుల అన్యోన్య అనురాగపాశాలు
పరిణయ బంధనాలు
సంతాన మమతల గ్రంథులు.

**133**

ప్రకృతి లీలా మాయలు
నిర్విరామముగా సాగాలె
అందరు ప్రకృతి వలలో పడాలె
ఎరను మింగ్రి పట్టుపడాలె.

**134**

తెలుగు తల్లి ముఖాన
తిలకము దిద్దాడు రాయప్రోలు
శిరోజాల చిక్కు తీశాడు జాషువా
కబరిని పుష్పహారాలతో అలంకరించాడు
కృష్ణశాస్త్రి
వస్త్రాల కట్టబెట్టాడు విశ్వనాథ.

**135**

అపరాధముల చేయతగిన తరుణాలలో
చేయక నిబ్బరము చూపాడు
పరువు దక్కింది
సంస్కృతి గెలిచిందని
అభినందించుకొన్నాడు.

**136**

చేసిన పాపాలు చాలా
చేయని పాపాలు చాలా
చేసిన పుణ్యాలు చాలా
చేయని పుణ్యాలు చాలా
బ్రతుకు తెరపై కనబడుచుంటాయి.

**137**

ప్రపంచములోని
విషాదాలు దుఃఖాలు
దేవుడనే వ్యక్తి కల్గించియుంటే
సైతాను అతనిని నిత్యము
చిత్రహింసకు గురిచేస్తూ ఉండాలె
అన్నాడు జర్మన్ వేదాంతి.

**138**

పుట్టుక లేకుండా
శస్త్రచికిత్స చేసికోవచ్చు
చావు లేకుండా
ఏ చికిత్సలు పనికిరావు
పూజలు భజనలు అంతకుముందే
పనికిరావు.

**139**

మానవుడా, విధి ఆఘాతములచే
నీ శిరమంతా రక్తమయము.
కాని నీ మస్తకాన్ని ఎన్నడు వంచలేదు
నీ కంఠాన్ని ఎన్నడు దించలేదు.

**140**

అరసికులైన ఈర్ష్యాళువులకు
పుస్తకాల సమీక్షలకు పంపుతారు.
సమీక్షలు పత్రికలతో పాటు
దుమ్ము డబ్బాలలో చేరుతాయి
పుస్తకాలు నిలుస్తాయి.
కాలనీరాలలో తేల్తూనే ఉంటాయి.

**141**

ప్రేమికులు
సినిమాల్లోవలె
యుగళనృత్యాలు యుగళగానాలు
పార్కులో చేస్తుంటే
పిచ్చి ఆస్పత్రిలో చేరి
ఏకాంత సేవలు చేస్తారు
విరహగీతాలు పాడ్తారు.

**142**

మానవుడా, నీవు పెరగాలె
ఇంకా పెరిగి మహోన్నతుడవు కావాలె
విధి కూడా అదిరి
నీ సంకల్పమేమని అడగాలె
అంటాడు ఇక్బాల్.

**143**

స్వప్న రాజ్యములో కల్పనా మందిరములో
ఊపిరిగొన్న అజంతా సుందరివలె
దేవి రూపములో కాన్పించుచున్నది ఆమె.
ఎన్నో ప్రణయ ఆశలు యౌవనోద్వేగాలు
ధూపము రీతి దేవిని క్రమ్ముచున్నవి
అరమోడ్పు కన్నులతో
పరిసరముల వీక్షించుచున్నది.

**144**

తేలు కొండెతో విషము క్రక్కుతుంది
పాము కోరలతో విషము క్రక్కుతుంది
పిచ్చికుక్క ఉమ్మితో విషము క్రక్కుతుంది
కువిమర్శకుడు నాలుక పేనాతో క్రక్కుతాడు
పెద్దల అన్నముపై విషపు నేతిబొట్టును చల్లుతాడు.

**145**

తెలుగు తేరును
తెలుగు పండితులు
చిన్నయ్యసూరి మోకులతో
మిత్రలాభము మిత్రభేదము
దినాలకు లాగాలని చూస్తారు.

**146**

వ్యాకరణ విజయమైయుంటే
భాష పిడసపారి ముద్ద కట్టేది.
సాహిత్యము పత్రికలు సినిమాలు
జీవసమాధిలో సూత్రాల జపమాలను త్రిప్పుచుండేవి.

**147**

చాలా దేశ భాషల్లో
దుష్టసమాసాల బెడదపోయింది
తెలుగువారు ఆ పుచ్చిన దూలాలను
పట్టుకొని ఊగుచు పడబోతున్నారు.

**148**

తెగిపోయిన సూత్రాలను
పట్టుకొని తెలుగు సాధించిందేమి?
కన్నడులు మళయాళీయులు
ముందుకు పోతుంటే
ఈర్ష్యతో చూస్తూ కళ్లు నలుపుకొంటున్నారు.

**149**

ప్రకృతి చాల చతుర నిపుణ
తన ఆటల సాగిస్తు
మనల కీలు బొమ్మలుగ ఆడిస్తుంటుంది
పిల్లల కనమని కవ్విస్తుంటుంది
ఆమె గిలిగింతలకు లొంగిపోతుంటాము.

**150**

నిరుపేదలు కూడ
పిల్లల కనాలని కోరుకుంటారు.
సంతాన నిరోధ ప్రచారాన్ని
నిరోధిస్తారు
జగమే మాయ అని పాడుచునుంటారు.

**151**

దుఃఖ తిమింగలాలు
ఆకొని సంసార సాగరములో
తిరుగుచునుంటాయి.
పుట్టిన ప్రతి ఒక్కడు
తిమింగలాలతో పోరు సల్పుచుంటాడు.

**152**

పశ్చిమ దిశా కపోలాలు
అరుణములగుచుండ
సూర్యబింబము సెలవు తీసికొన్నది.
సంధ్యాముక్త కేశాలు
నీలమేఘ మాలికలై
కపోలాల క్రమ్మివేశాయి.

**153**

మేఘస్తన్యాల కుడుచుచు
తారలు పరుండి ఉన్నాయి.
తృప్తిగ నిదురించిన పిదప
స్తన్యధారలే జలధారలయ్యాయి.

**154**

వాన ఆగింది
వరండా పెంకుల నుండి
నీటిబొట్లు రాలుచునే ఉన్నవి.
పొగడ పువ్వులు ఒకదానిపై ఒకటి
రాలి పండయగుటకు
సిద్ధపడుచున్నాయి.

**155**

మలయ సమీరాలకు
వృక్షాలు శిరాల పంకించుచున్నాయి.
పూర్ణచంద్రుడు
వెలుగులతో చీకట్లతో
దోబూచులాడుచున్నాడు.

**556**

మాటల్లో ఆమె అప్పుడప్పుడు
నవ్వుచున్నది.
పన్నుల వరుస
వెలుగుల వాగుగ మెరసింది.
మౌనంగా ఉన్నప్పుడు
ఇంకిపోయిన వాగుగ తోచింది.

**157**

ఆ జవ్వని నిరపరాధి
మదాలసయై మందగమనముతో
సినిమాకు వెడలుచున్నది.
నలువైపుల ఎంత ఉత్సుకత
ఉత్కంఠ అశాంతత
రేపుచు వెడలుచున్నదో
ఆమెకు ఎరుకలేదు.

**158**

కలలు కనుట
పిల్లల కనుట
కన్నులు లేనివారూ
చేయగలిగిన కార్యమే.

**159**

సృజన కార్యానికి మానవులే సిగ్గిలుచున్నారు
గోప్యముగ జరిపే కార్యము.
జన్మేంద్రియాలను భద్రంగా దాస్తారు.
ప్రైవేట్ పార్టుస్ అని అంటారు.
ఎందుకో జడ్జిగారు అబ్జక్షనబుల్
పార్టుస్ అని అన్నారు.

**160**

వివాహమైన కొలది మాసాలకే
భార్య కండ్ల ఎదుటనే
పెద్ద ఉద్యోగి రైలు దిగి
ఎక్కలేక జారి నలిగిపోయాడు
యువతి ఎన్నెన్ని ఆకాంక్షల
స్వప్నాల దుర్గాలు ఒక్క త్రుటిలో
కూలిపోయాయి.
దుమ్ముతో చీకట్లు క్రమ్మాయి.

**161**

మినీ కవితల కాలమన్నారు
మినీ కవితల సమ్మేళనాలు జరిపారు
సంకలనాలు ప్రచురించారు.
నా ఆమెల ముక్తక పద్యకాలు
మైక్రో-మిని కవితలంటాను.
మిని, మైక్రో-మిని వేషాలు
ఆధునికతా విలాసిని వినోదాలే.

**162**

క్యూపేలో పరుండి
దీర్ఘ ప్రయాణము చేస్తుంటే
రైలు తంబూరాకు
హృదయము విప్పి పాడ యత్నిస్తుంది
కవితాసుందరి
ఉయ్యాల ఊగినట్లుంటుంది
విడిన జుట్టు ముడితో
రేగే చీరకొంగుతో
ఉయ్యాల ఊగినట్లుంటుంది.

**163**

ఉత్తర భారతాన్ని
దక్షిణ భారతాన్ని
కలిపే గ్రంథ రాజమే
రామాయణము.
భారతానికి లేదు
ఈ ఏకీకరణ.

**164**

మానవులకు
పశు పక్ష్యాదులకు
స్నేహము కుదిర్చింది రామాయణము
ఆంజనేయులు, జాంబవంతుడు
జటాయువు మంచి పాత్రలే వహించారు.

**165**

కైకేయి వరాలు
సీతాపహరణము
వాలి వ్యభిచారము
మినహాయిస్తే, మిగతా పాత్రలు
ఉదాత్తాలే.
విభీషణ పాత్ర
వివాదగ్రస్తమయ్యింది
తొలి డిఫెక్టరుగా కొందరు చిత్రిస్తారు.

166

రాముని అనుసరించిన లక్ష్మణుడు
ఉదారుడైతే
రావణుని అనుసరించిన
కుంభకర్ణుడు అంతే
ప్రభుభక్తి, భాతృ గౌరవము
చూపించారు.

167

శబరి గుహుడు హనుమంతుడు
ఎంత భక్తిని చూపారు
కొండజాతి వారైనా
మానవాతీత గుణాలను చూపారు.

168

రాంసే బడ్‌కర్ రాం కీ దాసా
అన్నాడు గోస్వామి తులసీదాసు
హనుమంతుని గూర్చి
రాముని కన్న మిన్నయైనవాడన్నాడు.
అయోధ్యలో రామమందిరము కన్న
హనుమాన్ మందిరమే ప్రధానము.
ఢిల్లీ వైపు మందిరానికి వెడలినాడంటే
హనుమాన్ మందిరానికే అని అభిప్రాయము.

**169**

పితృ ఆజ్ఞచే రాముడు
రాజ్యము వదలినాడు
ఆరణ్యమునకు వెడలినాడు.
భరతుడు అంతరంగ ప్రేరణచే
వచ్చిన రాజ్యలక్ష్మిని వలదన్నాడు.
సింహాసనచ్ఛాయలలోనే
వనవాస వత్సరాలు గడిపాడు.

**170**

రావణుడు సీతాపహరణము చేసి
దుష్టుడైనాడు.
సీతను ఎన్నడు బలాత్కారించలేదు
మానభంగము చేయలేదు.
అనునయములతో, ప్రలోభములతో
ఒప్పించి పరిణయమాడ తలిచాడు.

**171**

యౌవనలతా మండపములో
సౌందర్య కలాపి పురివిప్పి
నాట్యము చేసింది.
శూన్య మధ్యములగు సింహాలు
చకితవీక్షణములగు హరిణాలు
గమనాలసములగు మత్తేభాలు
గతి చాతుర్యములగు రాజహంసలు
నృత్య ప్రదర్శనకు వచ్చాయి.

**172**

సౌందర్య తరణి
ప్రణయ సాగరములో
లంగరు వేసింది
పీన వక్షోజములతో
గురు నితంబములతో
లంగరు వేసింది.

**173**

ఆమె ఆనన వైభవమును తిలకించుటకు
పద్మ ద్వితీయుడై పద్మవిభుడు
మధుకాంక్షచే భ్రమరాలు
విచలిత వీక్షణాల నేర్వ కురంగాలు
వచ్చి విడిది చేశాయి.

**174**

తారుణ్య తోయములలో
ముఖ సౌందర్యము వీక్షించింది.
పద్మదళముల చంపక పుష్పముల
అరుణబింబముల మృణాళముల
కమల కోరకముల వీక్షించింది.
ఆనంద విహ్వలతను పొందింది.
పులకితగాత్రయై నిట్టూర్చింది.

**175**

మృత్యు పీయుషాన్ని పానము చేసే ముందు
ఎన్ని గిన్నెల హాలాహలాన్ని త్రాగాలో
ఎన్ని దుఃఖభరిత సమస్యల విషపాత్రలో
ఎన్ని రోగవేదనల చీత్కారాల విషపాత్రలో.

**176**

శ్రమ తప్పించడానికి
ఆమె హోటల్‌లో దిగింది
ఆతిథ్యము నిచ్చే గౌరవము నుండి
మమ్మ వంచించింది.

**177**

ఏనుగులకు అంకుశాలే కావాలె.
గుర్రాలకు కంజీలే కావాలె.
ఎద్దులకు కఱ్ఱపుల్లలే కావాలె.
మనుష్యులకు మాటలే చాలు.

**178**

రెండు రాళ్లు ఢీకొంటెనే నిప్పు పుట్టేది.
వృక్షాలు రాసుకొంటెనే దావాగ్ని పుట్టేది.
తరంగాల ఒత్తిడికే బడబాలనము పుట్టేది.
అనురాగనయనాలు సంధిస్తేనే
ప్రణయాగ్ని పుట్టేది.

**179**

ఎండాకాలపు మబ్బులకే వడగండ్లు పుట్టేది
ఎండాకాలపు ఎండలకే సుడిగుండాలు పుట్టేది
హేమంత శిశిరాలలోనే మంచు మబ్బులు ముసిరేది
వర్షాకాలపు మబ్బులే
ముసల ధారగ కురిసేది.

**180**

భాగవత కృష్ణుడు
చాల మందికి ప్రియమైన కృష్ణుడు.
బాలక్రీడలు, రాసక్రీడలు
జలక్రీడలు ముద్దుగ ఉంటాయి.

**181**

భారత కృష్ణుడు తక్కువవాడా
శిశుపాల సంహారము
కృష్ణరాయబారము
గీతోపదేశము
విజయ సారథ్యము
తక్కువ విషయాలా
శృంగార క్రీడలు కాకపోవచ్చు
వీరోచిత చతుర క్రీడలే.

**182**

ఇప్పటికైనా ఆమెకు మొట్టికాయ పడింది
మొట్టికాయలు వేయడమే ఆమె పని
మొట్టికాయ రుచే ఆమెకు తెలియదు.
ముసలితనములో మొట్టికాయ తిని
వేసిన మొట్టి కాయలకు పశ్చాత్తాపము పడింది.

**183**

పండితుల వివాదాలు
పరుషములే కాని సరళములు కావు
అన్నాడు కట్టమంచి.
విమర్శలు చేసి చేసి
విమర్శల మూటల క్రింద
పడి మూలిగాడు ముసలి విమర్శడు.

**184**

ధార్మిక ఆచారాల ముసలితనపు చేష్టలు
రాజకీయ వ్యవహారాల పడుచు ప్రాయపు
కొంటెతనాలు
మనల నేడు కలవరపెట్టుచున్నవి
పెనవేసుకొన్న సంకెళ్లగ అదుముచున్నవి.

**185**

ఔద్ధత్యము కాకపోయినా
నా ఔన్నత్యము
అందరి దృష్టుల ఆకర్షించుచున్నది.
పొడగరిని, గడుసరిని కాను.

**186**

ఆధునిక ఇతిహాసాన్ని వదలి
పురాతత్వశాస్త్రానికి దగ్గర చేరాడు
ఆ వృద్ధ పండితుడు
భాష ఆచారాలు శరీరము
గత శతాబ్దానివే
అరసున్నల నెమరు వేస్తాడు
శకటరేఫల మీద పయనిస్తాడు.

**187**

మేఘతూణీరము నుండి
ఆకాశము ఎన్ని అంబుల రువ్వుతుంది
తుంపరలు వానబొట్లు మంచుపొగలు
వడగండ్లు పిడుగులు
అన్నిటినీ సహిస్తుంది
భూమి ధూళికవచాన్ని తాల్చి.

**118**

సొగసే నీ సొమ్మా
అన్నది పగలు రేయిని చూచి
నిన్ను కలియ నేరని సొగసే
నా చావు అన్నది రేయి విచారంగా.

**189**

తెనుగులో వ్రాసిన వారిలో
మిన్న ఎవరని అడిగింది ఆమె.
వ్రాశారో పాడారో తెలియదు
త్యాగయ్యే అని నేనన్నాను.
అవునండీ, త్యాగయ కృతులలో
సంగీతమున్నది, సాహిత్యమున్నది
భక్తి రక్తి కలిసి ఉన్నాయి
ఆంధ్రభాష గర్వించదగిన మహాపురుషుడు.

**190**

కొందరు స్నేహితులను
దూరంగా ఉంచితేనే మేలు.
దగ్గర సంబంధము
సంఘర్షణాలకు దివిటీలు పడుతుంది.

**191**

ముఖ్యమంత్రియైన దినము నేడు
రాజకీయాల వదలినా
మెదడు పాతకాలాల
ఎండుగడ్డిని నెమరు వేస్తుంటుంది.

**192**

రాధే కలియుగములో
చైతన్య ప్రభువుగ జన్మించింది
కాబోలు అన్నాను.
కృష్ణ పారవశ్యము పొందేవారు
ఇంకా చాలమంది ఉన్నారు.
చైతన్యుడు తిరిగి జన్మించాడేమో
కృష్ణప్రియలై నారేమో వారు అన్నది ఆమె.

**193**

ఎవరెవరి భావము వారిది
గత శతాబ్దపు సర్వోన్నత ఆంధ్రుడు
వీరేశలింగమైతే
ఈ శతాబ్దపు సర్వోన్నత ఆంధ్రుడు
ముట్నూరు కృష్ణరావు.

**194**

తెలుగు గ్రంథాల సమీక్షిస్తుంటాడు
పాశ్చాత్య విమర్శకుల గ్రంథకర్తల
పేర్ల విత్తనాలు చల్లకుండా
ఆయన సాహిత్య వ్యవసాయము సాగదు.

**195**

మనము ఏడ్చేది చాలనట్లు
పుట్టింది మొదలు చచ్చేవరకు
దుఃఖాలను సహిస్తు లోలోపల ఏడ్చేవారిని
పుట్టించడం మహాపాతక మంటాడు
జర్మన్ వేదాంతి షోపనోహర్,
బ్రహ్మచారిగానే ఉండిపోయాడు.

196

దేశములో జనాభా పెరిగింది
స్వాతంత్ర్యము తర్వాత రెట్టింపయ్యింది.
అవివాహితులందరు పెండ్లాడుంటే
దంపతుల కందరికి సంతానము పుట్టుంటే
శస్త్రచికిత్సల ఉద్యమము లేకుంటే
ఏమై ఉండేదో.

197

విగత ఉదంతాల తృణ చిహ్నాలను
స్మృతిపథమున నెమరుచు
ప్రాయపు సంజెమసకలో
మనస్సు రోమంథము చేస్తూ
ప్రయాణము సాగిస్తున్నది.

198

ప్రతి నెలలోను కొన్ని కొన్ని తేదులు
సంతోష వార్తలకో విషాద వార్తలకో
ఆలంబనములుగ నిలిచి ఉంటాయి
కొంతసేపు మనస్సు వాని చుట్టు
ఆవర్తిస్తు గుంజన చేస్తుంటుంది.

**199**

తెలుగు వెలుగుల సన్మానము
జరుగుతుందట మాకు ఉగాదినాడు
దుర్మతి చైత్ర శుక్ల ప్రథమ
రాత్రి అమావాస్య ఛాయలలోనే పుట్టుతుంది
పడమటి పెదవులపై చిరునవ్వుగ.
నెలవంక కాన్పించదు
వెన్నెలలేని వెలుగు ఉగాది
పగలు ఎంత ఎండో రేయి అంత చీకటి.

**200**

నడిప్రాయాన ఇచ్చిన చేతులే
ముసలితనములో తీసుకొనే చేతులయ్యాయి.
కొట్టే కర్ర నడిపే కర్రగ తయారగుతుంది
నీడల ఇచ్చే చెట్లు
నీడలకు కాళ్లు చాపుతాయి.
పరాశ్రయము వార్ధక్యము.

**201**

నిందించే కరపత్రాలను
తోడనే పాదపత్రాలు చేస్తే మంచిది
విషదంతాలను పెంచుకొని
వాతావరణాన్ని కలుషితము చేస్తుంటాయి.

## 202

హానరరీ డాక్టరు ఆఫ్ లిట్రేచరు చేశారు.
హానరరీ ప్రొఫెసర్ ఇన్ తెలుగు చేశారు.
ఆధునిక సాహిత్యముతో కన్న
సాహిత్యకారులతోనే నాకు పరిచయము
పుస్తకాలకన్న
పండిత కవులే దగ్గరైనారు.

## 203

ప్రభుత్వ కవి సమ్మేళనాల్లో
ప్రభుత్వాన్ని విమర్శించే కవితలే ఎక్కువ ఉంటాయి.
ధరలు లంచాలు అధికారుల ఉపేక్షలు
రాజకీయాల వెక్కిరింతలు
సామాజిక స్పృహ గొడుగు క్రింద చేర్తాయి.
కవి సమ్మేళన కవిత్వములో
వెక్కిరింతలే విమర్శలే
కవిత్వముగా చెలామణి ఆగుతాయి.

## 204

కొంతమంది 'దుందుభి'నే చూడకుండ మరణించారు
కొంతమంది ఒక దుందుభిని చూచి మరణించారు
కొంతమంది రెండు దుందుభుల చూచి మరణించారు
ఎవ్వరు మూడు దుందుభుల చూచి మరణించ లేదు
ఎవరి శాపమో మానవాళికి.

205

పక్షులు గూడులు కట్టుకొంటాయి
పశువులు గూళ్లను కట్టవు.
బీదజనులు గుడిసెల కట్టుకుంటారు
భాగ్యవంతులు భవనాలను ప్రాసాదాలను కట్టుకొంటారు.

206

భూమిని ఖండాలు ఖండాలుగ
చితకగొట్టి వేరు చేశామని నవ్వాయి సముద్రాలు
సముద్రవక్షాన్ని చీలుస్తూ
భూజనుల కలిపేస్తున్నామని నవ్వాయి ఓడలు.

207

ఆంధ్రప్రదేశ్ కు రజతోత్సవము
భవనం తొమ్మిదవ ముఖ్యమంత్రి
ఎవరు ఎట్లా ముఖ్యమంత్రి అయ్యారో కన్న
ఎవరు ఎట్లా దిగి పొయ్యారో
పరిస్థితులు ఎట్లా విషమించాయో
పరిశోధన చేస్తే ఆసక్తిదాయకముగా ఉంటుంది.

**208**

భవనం వెంకట్రామరెడ్డి
ముఖ్యమంత్రి కాగానే
పేరులోని రెడ్డిని వదలివేస్తు ప్రకటన చేశాడు
మంచి పని చేశాడని తలచాను.
భార్య ఆక్షేపిస్తే వదిలాడా
అని అడిగాడు ఒక వైద్య ప్రముఖుడు.

**209**

30–32 సంవత్సరాలలో మునుస్వామినాయుడు పిదప
కమ్మవారు ముఖ్యమంత్రి కాలేదు
32 వ సంవత్సరములో అల్లుడి కన్న
సంపాదించారని అభివందనముల పొందారు.

**210**

పండుగపూట స్నానము చేసి
దేవాలయానికి వెళ్లి దేవుని దర్శించుకొందామా
ఆశ్రమానికి వెళ్లి స్వామిజీని దర్శించుకొందామా
అని ఆలోచించాను.
ఇంటిలోనే ఉండి మహాకవి పద్యాలను
చదువుకొంటు ఆనందాన్ని పొందుదామని
నిర్ణయించుకొన్నాను.
బండి వాడుగ మిగిలించి
ఆనందము దక్కింది.

**211**

భూతకాల స్మృతిచ్ఛాయలు
దీర్ఘములగుచుండ
భవిష్యత్తు కాల నిరీక్షణచ్ఛాయలు
హ్రస్వములగుచుండ
వార్ధక్యపు మూటల నెత్తి నిడుకొని
మానవుడు పయనిస్తుంటాడు.

**212**

వర్షాకాలపు పునాది
ఎండాకాలమని మరచి
ఎండాకాలాన్ని నిందిస్తుంటారు
భరణి కృత్తిక రోహిణి కార్తెల
నిర్గమమునకై నిరీక్షిస్తుంటారు.

**213**

బృందావన ముఖ్యమంత్రి
పోర్టు ఫోలియోలు మాటికి మాటికి మార్చడు
గౌరవనీయ సత్యభామకు సల్లాపాలు క్రీడలు ప్రణయ కలహాలు
గౌరవనీయ రుక్మిణికి దేవాలయాలు భక్తిశ్రద్ధలు తులసీవనాలు
గౌరవనీయ రాధకు ప్రణయ తన్మయత్వాలు యమునా సైకతాలు,
తమాల వనాలు, నెమళ్ల పెంపకము అప్పగించి
పై పెత్తనము సాగిస్తుంటాడు
మహిళాభ్యుదయము, సాంస్కృతిక వ్యవహారాలు, పశుపోషణ
తనే స్వయంగ నిర్వహిస్తాడు.

**214**

ఇంటిపేరు మరుగుపరచి
ఇంగ్లీషు తొలి అక్షరాన్నే ఎరుక పరుస్తుంది
పేరు ముఖ వర్చస్సుల చూచి
అగ్రవర్ణయని పెక్కుమంది ఆదరణల పొందుతుంది
తమ కులస్థురాలు కాదని
కొంతమంది ఉపేక్షల సహిస్తుంది.

**215**

ఇంట్లో తల్లిదండ్రులు
అన్నదమ్ములు అక్కచెల్లెండ్రు
కూతుళ్లు కొడుకులు
అందరు రక్తసంబంధపు చుట్టాలే
పరాయిది పెండ్లామే.
ఎక్కడనుంచో వచ్చి మంత్రాలు చల్లి
అందరి మీద పెత్తనము సాగిస్తుంది.

**216**

మూడు వందల ఖర్చుతో
తల్లి పురుడు పోసుకొని అబ్బాయిని ఇంటికి తెచ్చింది.
పెద్దై ముప్పై వేల ఖర్చుతో
వైద్యుడు చికిత్సచేసి పైకి ఎగరేశాడు.

217

అక్షరాలు ముత్యాలు

పలుకులు బంగారు

నవ్వులు రవలు

కనుబొమలు సెలాలు

గోళ్లు పగడాలు

మాటలు మంచి గంధపు ఊటలు

చేతలు చిగురాకు చిన్నెలు

ఊహలు విరజాజి గంధాలు

మనస్సు ముద్దమందారం

అని మినీ కవిత చదివాను

ఇన్ని రాగాలు రంగరించుకొన్న

రాగరాగిణి ఎవరో కాని

ధన్యవాదాలు అన్నది

మీరే అన్నాను.

కవులు సన్యాసులు

ఒక చేతితో అతిశయోక్తి అలంకారాలు తొడుగుతారు

ఇంకొక చేతితో వేళాకోళాలు

విసరుతారు అన్నది

కన్నులు వంచి చిరునవ్వు నిట్టూరిస్తూ.

218

సురవేశ్యలు ఎంతమంది అని అడిగాను..
రంభ, ఊర్వశి, తిలోత్తమ, మేనకలని విన్నాను.
రంభ అన్ని రంగాలలో కళలలో నేర్పరి
ఎక్కువ మొదటి ఓట్లు ఆమెకే వచ్చాయి.
అందాన్ని మెచ్చుకొనే రసజ్ఞులు, కవులు
ఊర్వశిని ఎన్నుకొంటారు.
మేనకకూ అభిమాన సంఘాలు సమితులు ఉన్నాయి
మరి, తిలోత్తమ ఎక్కడా కాన్పించదే!
అందములో తక్కువా
జాణతనము లోపించిందా
ఇంద్రుడే సొంతం చేసికొన్నాడా ?

219

వీర స్వర్గము పొందిన శూరులకు
యజ్ఞయాగాదుల చేసే శాస్త్రిలకు
సురవేశ్యలు హారతుల పట్టి
పూర్ణకుంభములతో స్వాగతం చేస్తారు.
పుణ్యము చేసిన ఆడవాళ్లకు ఏమి ప్రతిఫలము ?
భూలోకములోని భర్తలేనా
పాపాలు చేసి వాళ్లు నరకానికి వెళ్లియుంటే!

220

ఆమె మా ఇంట అతిథిగా దిగింది
ఆనంద హేతువయ్యింది, గర్వకారణమయ్యింది
మందగమనాలు, మృదుభాషణలు
ఇంటికే శోభను చేకూర్చాయి.

221

సభలో రమ్యంగ ఉపన్యసించింది
హారాల పరిమళాలతో
ప్రశంసల అభివాదాలతో
ఇల్లు నిండి ఉబికింది.

222

సద్గుణ రాశియైనా
అన్ని హంగుల ప్రోదియైనా
సోత్కర్షగ ఏమీ చెప్పుకోదు.
పూర్ణకుంభము వలె వర్తిస్తుంది
పూర్ణకుంభము ఆంధ్ర ప్రభుత్వ చిహ్నమైంది.

**223**

కొద్ది నాళ్ళుండి ఆమె స్వగ్రామానికి వెళ్ళింది
వెలుగు పోయిన ఇల్లు మసకలుగ తోచింది
మౌన గాంభీర్యముతో నిండిన భవనము వెలితిగ తోచింది
ఆత్మీయతా సుగంధాలు కొరతైన ఉద్యానవనముగా తోచింది
కోకిల వెడలిపోవ ఆమని తోటగా తోచింది.

**224**

ఆమెతో జరిపిన సాహిత్య గోష్ఠి
ఆమె చతురోక్తులు సంభాషణాస్ఫూర్తి
ఆమె సాహచర్య సౌభాగ్యదీప్తి
నా మదిలో ముడి వేసికొని ఉన్నాను
ఆ ముడి విప్పలేను, ఇతరులకు అందియ్యలేను.

**225**

అమావాస్య నాడే ఆమె వచ్చింది
అమావాస్య శిరముపై పౌర్ణమియై వచ్చింది
నల్లమబ్బు పడతి మెరుపు జల్తారు చీరతో వచ్చింది
నీలకాసారములో వికసించిన కమలమై
తిమిర కుంతలములలో హసించే మల్లికయై
కృష్ణుని తనువుపై అల్లుకొనే రాధావల్లికయై వచ్చింది.

**226**

గృహిణులైన రచయిత్రుల చూచి జాలి వేస్తుంది
ఇంటి పనులు వంట పనులు చేస్తు
చదువుకొంటు, వ్రాసుకొంటు,
ఉత్తరాలకు సమాధానా లిచ్చుకొంటు
ప్రచురణలకు వ్రాతప్రతుల పంపిస్తు
సాహిత్య సభలకు హాజరగుతు ఎట్లా ఉంటారో
ఇంట్లో సహాయము చేసేవారు లేనపుడు.

**227**

రాయల రాజ్యం అస్తమించి శతాబ్దాలైంది
సంజీవరెడ్డి పదవీ విరమణతో
రాయలసీమ రాజ్యం అస్తమించింది.

**228**

రాజకీయాపు పెద్ద పదవులు
అనధికారుల చేతిలో ఉండుటే మంచిది
ప్రభుత్వోద్యోగము చేసి పెన్షన్ పుచ్చుకొంటు
ఆ పదవుల ఆశించడం తప్పు అని నా భావన
ప్రజాజీవితపు ఒడుదుడుకులు తెలిసిన వారు
అనధికారులు.

229

ఆమె చెణుకులు ముగిశాయి.

ఆమె పంచకము ముగిసింది

వేయికి పైగ భావాలను విమర్శనలను

ఆమె దండెం మీద ఆరేశాను,

కొన్ని ఆమె బీరువాలోని వస్త్రాలైతే

కొన్ని ఆమెకు సంబంధము లేనివే.

సర్దాకే వ్రాశాను, ఆమెకు అంటగట్టాను.

ఇంతటితో ఆమెకు స్వస్తి.

చాలకాలము విసిగించింది.